# తప్పక చూడండి



శ్రీదుర్గా ప్రొడక్షన్స్
దబ్బారాయుడు
సుబ్బారాయుడు
దర్శకత్వం: వి.శ్రీనివాసన్
నిర్మాతలు:
ఎస్.వి.శేషయ్య
వి.వి.స్వామి
సంగీతం.
బి.గోపాలం
పూర్ణా రిలీజ్
NAVRANG

INTERPUB/LG 2 TL

# పురోగతిని బట్టల యుత్పత్తిలో 322 సంవత్సరాల పారంపర్యంతో కలిపేదెవరు?



## మేము



కాలగతిలో 322 సంవత్సరాల అనుభవం అపారమైనది. ఈ యనుభవం ఏడు మిల్లుల సంయుక్తమైన అనుభవమైన సరే. అది మాదే—లాల్‌భాయ్ గ్రూప్ వారిది. మా బట్టలు భారతీయ వారసత్వములో భాగమైనవి
మా మొదటి మిల్లు 1906 సంవత్సరంలో ఉత్పత్తి ప్రారంభించినప్పటినుండి కాలములో అనేక మార్పులు వచ్చినాయి. కాలముతోపాటు మేముకూడా మున్ముందుకు గడచిపోయినాము. ఈ రోజు మా మిల్లులలో మిక్కిలి నూతనమైన సాంకేతిక పద్ధతులు, అధునాతన యంత్రము ఉపయోగించి నాణ్యతకు పేరుగన్న అనేక రకములైన బట్టలను తయారుచేయుచున్నాము. మా బట్టలు ముందుకాలములో అనేక యేళ్ళవరకు వాడుకలో ఉంటాయని సగర్వంగా చెప్పుకొంటున్నాము. లాల్‌భాయ్ ట్రేడ్ మార్కుకోసం వెతకండి: బట్టల నాణ్యతకు అది గ్యారంటీ.

# లాల్‌భాయ్ గ్రూప్

ది అర్‌విండ్ మిల్స్ లిమిటెడ్
ది రాయ్‌పూర్ మ్యాన్యుఫాక్చరింగ్ కంపెనీ లిమిటెడ్
ది అశోక మిల్స్ లిమిటెడ్
ది సరస్‌పూర్ మిల్స్ లిమిటెడ్
ది అరుణా మిల్స్ లిమిటెడ్
ది అహమ్మదాబాద్ న్యూకాటన్
ది నూతన్ మిల్స్ లిమిటెడ్

# ఉత్తరాలు

## కొన్ని సందేహాలు

శ్రీ శ్రీకృష్ణగారు కొన్ని రాష్ట్రాలలో పెట్టుబడి, కర్చుల అంకెలని ఉదహరించారు. 'హిందీ సమస్య' వీటికి ఎలా ముడిపెట్టబడుతున్నదో సూచించారు.

నాలుగవ పంచవర్ష ప్రణాళికలో పెట్టుబడి కర్చుల సంఖ్యలు కొన్ని ఈ క్రింద ఇస్తున్నాను—

**1. హిందీ రాష్ట్రాలు**

| | | | | |
|---|---|---|---|---|
| బీహార్ | .... | రు. | 940 | కోట్లు |
| మధ్యప్రదేశం | .... | రు. | 800 | „ |
| పంజాబు | .... | రు. | 500 | „ |
| రాజస్థాన్ | .... | రు | 438 | „ |
| ఉత్తరప్రదేశం | .... | | 1405 | „ |
| మొత్తం | | రు | 4083 | కోట్లు |

**2. దక్షిణాది రాష్ట్రాలు**

| | | | | |
|---|---|---|---|---|
| ఆంధ్రప్రదేశం | .... | రు | 784 | కోట్లు |
| కేరళ | .... | రు. | 442 | „ |
| మదరాసు | .... | రు. | 750 | „ |
| మైసూరు | .... | రు. | 500 | „ |
| మొత్తం | | | 2476 | కోట్లు |

పంజాబు హిందీ రాష్ట్రం కాదుకాని హర్యానా అందులోనిదే కాబట్టి ఈ రాష్ట్రాన్ని కూడా హిందీ జాబితాలో ఇవ్వటం జరిగింది.

హర్యానా అందులోనిదే కాబట్టి ఈ రాష్ట్రాన్ని కూడా హిందీ—జాబితాలో ఇవ్వటం జరిగింది

1961 జనాభా ప్రకారం హిందీ రాష్ట్రాల ప్రజల సంఖ్య మొత్తం సుమారు 19 50 కోట్లు

దక్షిణాది రాష్ట్రాల ప్రజల సంఖ్య సుమారు 11 కోట్లు.

అంటే ఇంచుమించు 19.5 కోట్ల మందికి సుమారు 4080 కోట్ల కర్చు జరిగితే ఇంచుమించు 11 కోట్ల మందికి జరగవలసిన కర్చులో తక్కువ ఏమీ జరగటం లేదని చిన్న లెక్కవేసి చూస్తే తెలుస్తుంది!

ఇక ప్రభుత్వరంగం కంపెనీలు: ఈ కింది పట్టికలో 1966కి కొన్ని రాష్ట్రాలలో ప్రభుత్వ రంగం కంపెనీల పెట్టుబడి (పెయిడ్ అప్ కాపిటల్) మొత్తాలు ఇవ్వబడ్డాయి (కోట్ల రూపాయలు):

| | | |
|---|---|---|
| ఆంధ్రప్రదేశం | ...... | 11.54 |
| మదరాసు | ...... | 92.20 |
| కేరళ | ...... | 23.96 |
| మైసూరు | —— | 35 95 |
| మొత్తం | ...... | 163.65 |

| | | |
|---|---|---|
| బీహారు | ...... | 680.86 |
| మధ్యప్రదేశ్ | ...... | 56.83 |
| పంజాబు | ...... | 1.48 |
| రాజస్థాన్ | ...... | 7.53 |
| ఉత్తరప్రదేశ్ | ...... | 2.30 |
| మొత్తం | ...... | 749.00 |

ముగ్గురు ప్రధానమంత్రులని ఎన్నిక చేసుకున్న ఉత్తరప్రదేశం, హిందీవాదుల పుట్టినిల్లు అనతగ్గ రాష్ట్రం, కేవలం 2.30 కోట్ల రూపాయలకే నోచుకుంది! (బీహారు సంఖ్యవల్లనే మొత్తం ఎక్కువ అయిందికదా!)

ఆంధ్రప్రదేశం హిందీని నిరాకరించకపోయినా హిందీకి తీవ్ర శత్రువు అనతగిన మదరాసులో ఎవి మిదవవంతు మాత్రమే సంపాదించుకుంది!

ఈ అంకెల నిగూఢార్థం నాకు తెలియదుకాని హిందీ అభిమానం, వ్యతిరేకాలని వీటిలో వెతకటం సబబుకాదని మాత్రం అనిపిస్తోంది.

—ఒక విలేఖరి (మదరాసు.)

### కథలు

"నాలుగవ మజిలీ"— సింగరాజు రామచంద్ర మూర్తి, "జయమూ—అపజయమూ"— మునిపల్లెరాజు, కథలు బాగున్నాయి. చీకటి కడుపునకాంతి, హృదయంచిగిర్చింది మొదలగు సీరియల్సు కూడ చాలా బాగున్నాయి.

రాజవల్లభాయి (ముపుకాల)

* * *

"మిధ్యాబింబాలు" కథలో సుజాత ఆత్మహత్య చేసుకోడానికి సరైన కారణం లేకుండా చేశారేమో రచయిత్రి అనిపిస్తుంది.

యస్. ఆర్. పరిమి, (కాన్పూరు) ●

### గమనిక

ఉత్తరాల శీర్షికకి రాసేవారు ఈ కింది నియమాలు పాటించాలని మనవి: 1. ఉత్తరాలు వీలయినంత చిన్నవిగా ఉండాలి 2. రాసేవారి పూర్తి పేరు, చిరునామా ఇవ్వాలి 3. ఇంగ్లీషు లిపిలో అక్షరాలు రాయరాదు 4. కాగితానికి ఒకవయిపునవే రాయాలి. 5. సిరాతోనే రాయాలి. —సం॥


# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 3—5—'68
కీలకనామ సం॥ వైశాఖమాసం॥ శుద్ధ పంచమి
సంపుటము : 60 సంచిక : 34

స్థాపితము :
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 26.00 |
| 6 మాసముల చందా | 13.00 |
| 3 మాసముల చందా | 6.50 |


## విషయానుక్రమణిక


నదీజలాల
వివాదంలో
మధ్యవర్తిత్వం
ఈ సమస్యని అది
పరిష్కరించుతుందా?
దూరప్రయాణం
కోసిగిన్
తాష్కెంట్
ఒప్పందం
చైనా
ముఖ్యమంత్రి పదవి విడిచి
పెట్టడానికి నిజలింగప్ప
నిశ్చయం
శాంతికి చర్చలు ఎక్కడ జరగాలి?

# దృఢనిర్ణయం లేకపోవటం మనకే నష్టం!

ప్రధానమంత్రి మేనత్తగారు శ్రీమతి పండిట్, శాస్త్రి-ప్రభుత్వాన్ని సంకల్పం లేమికి బందీ అన్నారు. అప్పటినుంచి అమెరికాకి ప్రతికూలంగా వ్యవహరించడం లేక మాట్లాడటం ఫాషన్ అయిపోయింది. ఈ ధోరణివల్ల ఎక్కువ తక్కువలు సద్దవచ్చు నంటారు. కాని, తప్పంత అమెరికన్లదే—ట. కమ్యూనిజాన్ని అరికట్టడం వారి ముఖ్యోద్దేశం కాబట్టి అమెరికన్లు ఈ ధోరణికి భయపడరు, వారు మనకి ఇంత సహాయం చేస్తున్నారంటే భారత దేశంలో పెట్టుబడి విధానాన్ని అమితంగా బలపరచటమే వారి ఉద్దేశంకదా? ఇదీ వరస.

వాయిస్ ఆఫ్ అమెరికా— నోవోస్టి

వాయిస్ ఆఫ్ అమెరికా ఒప్పందంతో మనకి అదనంగా ఒక పెద్ద రేడియో ప్రసారయంత్రం (ట్రాన్స్మిటర్) వచ్చేది. దానిని రద్దు చేశారుకాని సోవియట్ వార్తాసంస్థ 'నోవోస్టి'తో ఒప్పందాన్నిమాత్రం అన్నివిధాలా నచ్చచెప్పి చూద్దామని ప్రభుత్వం ప్రయత్నిస్తోంది ఈ ఒప్పందం ప్రకారం 'నోవోస్టి' భారత ప్రభుత్వం సమాచార కార్యాలయానికి వ్యాసాలు, ఫోటోలు ఇస్తుంది. వాటిని దేశంలోని వివిధ పత్రికలకి వాడు కొనటానికి ఇస్తారు. ఇటీవలే అమెరికన్ విద్యాసంస్థ ఒకటి మన విద్యాభ్యాస సదుపాయాలని హెచ్చిస్తామంటే మన ప్రభుత్వంవారు వద్దన్నారు.

ఇదంతా గతచరిత్ర అనవచ్చు. అయితే, కొందరు భారతీయులతో హిల్టన్ హోటల్స్ వారు సహకరిస్తామంటే దానికి ఎన్నో నిబంధనలతో కాళ్లకి బందాలేశారు. ఇక అది జరగని పనికిందే లెక్క.

అయిల్ ఎండ్ నాచురల్‌గాస్ కమిషన్ (ఒ. ఎన్. జి. సి.) ప్రతినిధి ఇటీవలే పత్రికా విలేఖరులతో కాంబే ప్రాంతంలో సంచి నూనె-ప్రదేశం దొరికిందని అన్నారు. భారతీయులు గట్టినేల మీద, రష్యన్లు లోతుతక్కువ నీటిలోపలా పని చేస్తారుట, నూనె శోధనకోసం. ఏదయినా అంతర్జాతీయ నూనె కంపెనీకి ఈ శోధన పని పెట్టవచ్చుననే సూచన చెయ్యటం జరిగింది. డచ్ నిపుణులు కాంబే నీటి అడుగున నేల పటాన్ని తయారు చేశారన్నారు.

సుమారు 18 నెలల క్రితం అమెరికన్ సంస్థ ఆష్‌లాండ్స్ ఈ పరిశోధన ప్రారంభించి అందులో ఆసక్తిని కోల్పోవటం ప్రారంభించింది. ఆ తర్వాత టెక్సాస్‌కి చెందిన 'టెన్నెకో' సంస్థ కొంత కుతూహలం చూపింది. మంతనాలు జరిగాయి. వీటి ప్రకారం శోధన కర్చులన్నీ అమెరికన్ కంపెనీ పెట్టుకుంటుంది ఒకవేళ నూనె దొరకకపోయినా భారత దేశానికి ఏ విధమయిన బాధ్యతా ఉండదు నూనె గనక దొరికితే నిర్మించబడే కంపెనీలో టెన్నెకోకి 49 శాతం వాటా ఇవ్వాలి, అప్పుడు శోధన వ్యయం అందరూ పంచుకోవాలి.

పర్షియన్ గల్ఫ్ ప్రాంతంలో నూనె పడింది ఈ నిమిత్తమయి ఏర్పడే సంస్థలో భారతదేశానికి అరవ వంతు వాటా ఉంటుంది. శోధన కర్చులలో తన వాటా భరించటమే కాక భారతదేశం ఇరాన్ ప్రభుత్వానికి ఈ కార్యక్రమంలో పాల్గొన్నందుకు తన వంతు 'ప్రిమియం' వేరే ఇవ్వాలి

లాబీ వర్గాలవారి ప్రకారం ప్రధానమంత్రి ఈ పథకాన్ని అమోదించలేదుట. శోధన రష్యన్లే ఎందుకు చెయ్యడంలేదని ఆమె అడిగారుట

రష్యన్లకి లోతు నీటిలో శోధన నడిపే స్తోమత లేదని ఆమెకి తెలిపారు సలహాదారులు. రష్యన్లకి పెద్ద ఎరువు ఫాక్టరీలు పెట్టే సదుపాయాలు కూడా లేవు. బరవునీ, కొయాలీ నూనె పరిశుద్ధ కర్మాగారాలలోనూ, భిలాయి, బొకారో ఉక్కు మిల్లులలోనూ ఎరువు తయారీ సదుపాయాలు లేవు. అందుచేత ఈ వ్యవహారాన్ని కేంద్ర మంత్రివర్గం ముందు ఉంచారు. ఇంతలో రష్యన్లు కాంబేలో శోధించటానికి నిపుణుల బృందాన్ని పంపారు. రష్యావారి రిపోర్టు వచ్చేదాకా ఈ ప్రాజక్టు గురించి ఆలోచించటానికి వీలులేదని ప్రధానమంత్రి అనటం మొదలుపెట్టారు.

రష్యన్ నివేదిక వచ్చిందిట. లోతు సముద్ర జలాల్లో నూనెకోసం దొలవటం చాలా కర్చుతోకూడిన పని అనటం తప్ప వేరే ఏమీ అనకుండా ఊరుకున్నారు రష్యన్లు, అనుకుంటున్నారు అభిజ్ఞవర్గాలవారు.

రష్యన్లు నెగ్గుకు రాలేకపోతే ఎంత కర్చయినా సరే,/ మనమే అంతా చేసుకోవాలి అని మంత్రి సూచన వెలువడింది. 11 ఏప్రిల్‌నాడు జరిగిన కాబినెట్ మీటింగులో అమెరికన్ కంపెనీని ఏ విషయమూ ఎంతకాలం అలాగే ఉంచుతామని కొందరు అడిగారు. ఇష్టం లేకపోతే వారి ప్రతిపాదనని కొట్టిపారవెయ్యవచ్చు కదా అన్నారు. కాని, శ్రీయుతులు మొరార్జీ దేశాయి, ఆలీ అహమ్మద్ అశోకమెహతా, దినేష్‌సింగ్‌లతో ఒక సబ్ కమిటీని ఏర్పరిచి ఈ వ్యవహారాన్ని మరింత అనుశీలిస్తున్నారు. ఈ ఉపసంఘం నిర్మాణంపట్టి ఏ నిర్ణయమూ తీసుకొనటం జరగదని ఊహించవచ్చు.

అమెరికా అయితే?

ఇదే గనక రష్యన్లకి సంబంధించిన వ్యవహారమయినట్లయితే వెంటనే అమలు జరిపే నిర్ణయం తీసుకునేవారు. ఇది ఇలా ఉండగా నూనె దిగుమతులవల్ల భారత దేశం విదేశద్రవ్యాన్ని నష్టపోతోంది

రుమేనియాతో జరుపుకున్న కాతా-ఒప్పందం కమ్యూనిస్టులు భారతదేశాన్ని ఎలా శాసించగలుగుతున్నారో తెలుపుతుంది. కొన్ని ప్రాజక్టులని తమకి ఒప్పగిస్తే

తాము 5 కోట్ల డాలర్ల అప్పు ఇస్తామని రుమేనియా వారన్నారు. న్యూఢిల్లీ వద్ద నూనె పరిశుద్ధి కర్మాగారం, ఒక ల్యూబ్రికేషన్ నూనెల కర్మాగారం, ఒక వివిధ వస్తునిర్మాణ కర్మాగారం ఈ ప్రాజక్టుల జాబితాలోనివి. ఇవన్నీ అంత అవసరం కావు కాబట్టి, సాంకేతిక పరిజ్ఞానం ఇక్కడ తగుమాత్రం ఉంది కాబట్టి వీటి విషయమయి భారత ప్రభుత్వం అంత ఆసక్తి చూపలేదు. అంతేకాక నాలుగవ పంచవర్షప్రణాళిక అంచనాలు పూర్తి కానప్పుడు తొందరపడటం అనవసరం కూడా.

వార్ధాలో ఫవుండ్రీ ప్రాజెక్టు, 20 హార్స్‌పవర్ ట్రాక్టర్లు తయారుచేసే ఫాక్టరీ, ఇంకా 11 ఇతర ప్రాజెక్టులు, కట్టిఇస్తామన్నారు చెక్‌వారు. ఫవుండ్రీని అసలే ఆమోదించలేదు ట్రాక్టర్ల విషయంలో ఎన్నో సందేహాలు వస్తున్నాయి

అసలే ఆర్థికమాంద్యం ఉంది కాబట్టి రుమేనియా ప్రతిపాదనలని పరిశీలించవలసి వస్తుందని ప్రభుత్వంవారు అన్నారు రుమేనియావర్తకులవారు మండిపడ్డారు

గురువారం ఏప్రిల్ 4 వ తేదీనాడు ఒప్పందంమీద సంతకం పెడ్తేపెట్టండి, లేకపోతే అసలే వదులుకోండి — అని రుమేనియా మంత్రి అన్నారుట

## విధేయత

ఏప్రిల్ 4 వ తేదీనాడు కేంద్రమంత్రి పండితకృష్ణ చవుదరి పంత్ సంతకం పెట్టారు.

అమెరికన్లు అయితే ఎంతకాలం ఆగమంటే అంతకాలం ఆగేవారు!

ఇక ఆహారం సంగతి పార్లమెంటులో ఆహార — మంత్రి 1968 — 69 లో 2,948 000 టన్నుల ఆహార ధాన్యాల దిగుమతి జరుగనున్నదని చెప్పారు

ఇందులో,

2,551,000 టన్నులు అమెరికా
263,000 ,, కెనడా
94,000 ,, బర్మా
40,000 ,, ఈజిప్టు.

భారతదేశంలో వివిధ బాంకులలో 88 7 కోట్ల డాలర్లు అమెరికా స్వాధీనంలో ఉన్నాయి (సుమారు రు. 650 కోట్లు.) ఇదంతా ద్రవ్యోల్బణకి దారి తీస్తోందని ఒక ఆర్థిక శాస్త్రవేత్త; భారతదేశం అమెరికాకి లొంగేట్లు చేస్తోందని కొందరు; అమెరికావంటి పెట్టుబడిదారిదేశాల, పోషిస్తు విధానం అనుసరిస్తున్న రష్యావంటి దేశాలమధ్య ఉజ్జీ కుదిరేట్లు చెయ్యాలని మరికొందరు.

యదార్థాన్ని పరిశీలిస్తే ఏ పెట్టుబడిదారి విధానంకల దేశమూ మన నెత్తి మీద సహాయాన్ని రుద్దలేదు. అంతేకాక అధ్యక్షుడు జాన్సన్ సహాయంపొందే దేశాలు తమ కృషివల్ల అర్హత చూపాలంటే ఆయనని విమర్శించారు

మరి అమెరికా, కెనెడాలనుంచి ఆహారం దిగుమతులని ఎందుకు ఆపరాదు ?

## రష్యాతో వ్యాపారాభివృద్ధి

భారతదేశంలోని ఆర్థిక మాంద్యాన్ని అరికట్టేందుకు రష్యా చేస్తున్న సహాయం ఫలితాలని పరిశీలించటం అవసరం. ఇంతదాకా రష్యా మూడు ఒప్పందాలు చేసుకుంది. 1969 లో 2000 రయిల్వే వాగన్లు దిగుమతి చేసుకుంటుంది రష్యా. 1971 కి ఈ దిగుమతులు 10,000 నుంచి 25000 దాకా వెళ్ళవచ్చు 1975 కి ఒప్పందం ముగుస్తుంది

రెండవ అంశం ప్రకారం రష్యా మూడేళ్ళలో 200,000 టన్నుల ఉక్కు దిగుమతి చేస్తుంది. ఇది ఎక్కువ భాగం స్ట్రక్చరల్ రకం ఉక్కు.

మూడవ అంశం ప్రకారం రష్యా ఏటా 200,000 టన్నుల ముడి ఇనుము భారత దేశం దగ్గరకొంటుంది.

భారత దేశంలో 27,000 (4 చక్రాల) వాగన్లు తయారుచేసే సదుపాయాలు ఉన్నాయి రష్యావారు తమకి కావలసిన వాగన్ల పరిమాణాలు వగయిరా పంపించారు. దీనికోసం ప్రత్యేకమయిన ఉక్కు, బ్రేకులు, కమానులు తయారు చెయ్యాలి. ముందు 20 వాగన్లు మచ్చుకి పంపితే వాటిని పరీక్షించి కొనటం ప్రారంభిస్తారు.

ఈ వాగన్లకోసం భారతదేశం కొత్త ఉత్పత్తి శక్తిని నిర్మించుకోవాలి, అని వేరే చెప్పనక్కరలేదు

రష్యా వ్యాపారం మొత్తం విలువ సాలుకి 100 కోట్ల రూపాయలు ఉండవచ్చు. 1967–68 లో భారతదేశం రష్యాకి రు. 135 కోట్లు ఎగుమతి చేసింది, అక్కడ నుంచి 95 కోట్లు దిగుమతి చేసుకుంది. అంటే ఇండియాకి 40 కోట్లు మిగిలిందన్నమాట. ఈ కొత్త వ్యాపారం వల్ల పెద్ద అభివృద్ధి ఏమీ లేకపోవచ్చు. ఇంకొక విధంగా చెప్పాలంటే రష్యాలో భారత దేశం రూపాయల నిల్వ పెరుగుతూ వస్తుంది.

ఇక రష్యా మనకి ఈ కింది విధంగా అప్పులు తీరుస్తుంది— .

1968–69 ... రు 65.96 కోట్లు
1969–70 ... రు 54.90 ,,
1970–71 ... రు 34.82 ,,

అనుకున్నట్లుగా అన్ని ఎగుమతులూ ఫలిస్తే, భారత దేశం వీటికి బదులుగ రష్యన్ వస్తువులు కొంటె కొత్త ఎగుమతులు మాత్రం సాలుకు రు 100 కోట్ల చొప్పున పెరుకోవచ్చు. అప్పులు తీర్చగా ఈ పెరుకున్న ధనం మొత్తాలు ఈ కింది విధంగా ఉండవచ్చు—

1968–69... రు 34 04 కోట్లు
1969–70... రు 45.10 ,,
1970–71 ... రు 65.18 ,,

రష్యన్లు భారతదేశం కోసం అదనంగ దిగుమతులు చేసుకుందామనుకుంటున్నారు తమ సరుకునికూడా కొనమని భారత దేశాన్ని అడుగుతున్నారు కాని, భారతదేశం కొంత అభివృద్ధి సాధించిన దేశం. రష్యాలాగే మనకే ముడిసరుకు చాలా కావాలి ఈ 'పోటీ'ని ఎలా పరిష్కరించటం ? ●



# పెద్ద పెద్ద ఆశయాలున్నాయి
# ఉత్సాహముంది
# వృద్ధిలోకి వస్తున్నాడు
# అతడి సైకిలు ఫిలిప్స్

ఫిలిప్స్ దిట్టంగా ఉంటుంది ఎంత చెడ తొక్కినా తట్టుకొనేటట్లు మంచి ట్రూ టెంపరు స్టీలుతో తయారైంది. దాని అంద చందాలు గంభీరత కూడా మీ సంస్కృతిని బాగా తెలియజేస్తాయి. మీవంటి యువకులకు తయారుచేయబడిన విశిష్టమైన బైసికిలు.

. ఫిలిప్స్ మీరు వాడదగిన సైకిల్









®
జె.ఎ. ఫిలిప్స్ కంపెనీ లిమిటెడ్ యు.కె. వారి రిజిస్టర్డ్ ట్రేడ్ మార్కులు. ఇండియాలో తయారుచేయువారు: టిఐ సైకిల్స్ ఆఫ్ ఇండియా, అంబత్తూరు, మద్రాసు-53 ప్రొప్రైటర్లు: ట్యూబ్ ఇన్వెస్ట్‌మెంట్స్ ఆఫ్ ఇండియా లిమిటెడ్. మద్రాసు-1 ఉపయోగించుటకు రిజిష్టరు కావింపబడినవి. చిన్న మొత్తముల సేకరణలో ఆదాచేయండి.
T.I.C/P/3820a

## ® ఫిలిప్స్



# బాల్య వితంతువు-వదినగారి హత్య

వి. ఎస్. సుక్తాంకర్

వైద్యనాథపిళ్లె పెద్ద భూస్వామి. పెద్దమనిషి అనే పేరు సంపాదించుకున్నాడు. అతనిది తంజావూరు జిల్లాలోని పాండిగ్రామం.

వైద్యనాథ పిళ్లెకి ముగ్గురుభార్యలు. మూడవభార్యకి అయ్యాసామి అనే కొడుకు ఉండేవాడు. ఈ అయ్యాసామి తన బాబాయి సామిదేవన్ దగ్గిర పెరిగాడు. సామిదేవన్ గ్రామమునసబు.

అయ్యాసామి యుక్తవయస్కుడయిన తర్వాత అతనికి ధనం అనే అమ్మాయిని ఇచ్చి పెళ్లిచేశారు. ధనం మంచి కుటుంబానికి చెందినదే చాలా గడుసుఅమ్మాయి. మొగుడిని పూరిగా తన దాసుడినిగా చేసుకుంది.

1911 సంవత్సరం. అప్పటికి ఆరు, ఏడు సంవత్సరాలుగా ఇద్దరూ పాండి పక్కనే ఉన్న మరొక పల్లెటూరులో చుట్టాలతో కలిసిఉంటున్నారు. అయ్యాసామికీ, అతని తండ్రికీ పడేదికాదు. కాని, ఆ సంవత్సరం కొందరు శ్రేయోభిలాషులు ఇద్దరికీ రాజీ చేశారు.

13 సెప్టెంబర్ 1911 నాడు అయ్యాసామి దంపతులు, వారి పిల్లలు (నాలుగు, రెండుఏళ్లవారు) వైద్యనాథ పిళ్లె ఇంటికి మారిపోయారు.

మారిపోయే ముందు ఒక షరతు

పెట్టారు. అయ్యాసామి సవతి చెల్లెలు తంగబాలు తమతో కలిసిఉండటానికి వీల్లేదన్నారు. తంగబాలు బాల్యవితంతువు. ధనం ఆమె తన పవిత్రతని కోల్పోయిందని ఆరోపించింది. ఇటువంటి అపవిత్ర స్త్రీ తనతోబాటు ఒక ఇంట్లో ఉండటం పనికిరాదన్నది. ఈ షరతు తంగబాలుకి కోపం తెప్పించిందంటే ఆశ్చర్యంలేదు...

* * *

**22 అక్టోబరు**

అయ్యాసామి, ధనం తక్కినవారితో బాటు నిద్రకి ఉపక్రమించారు.

తెల్లవారగా ధనం శవం మాత్రమే మిగిలింది.

ఆమె వంటిమీద 13 గాయాలు లెక్క పెట్టారు అన్నీ ఏదో పదునయిన మొనగల సాధనంతో బలంగా పొడవగా ఏర్పడినట్టున్నాయి.

**23 అక్టోబరు**

హత్యావిచారణ జరిపారు. ఈ విచారణలో రక్తం మరకలుకల కత్తి ఒకటి ప్రదర్శించటం జరిగింది. ఇదిశవం దగ్గరే

# ఆవేశాలూ...

దొరికిందని పోలీసువారు అన్నారు. విచారణ జరిపిన అధికారి అయ్యాసామిపిళ్లె తన భార్య ధనాన్ని పొడిచిచంపాడని తీర్పు ఇచ్చాడు. అయ్యాసామిని నిర్బంధించారు.

**22 నవంబర్**

తిరుత్తిరయి పూండిలో సెకండుక్లాసు మెజిస్ట్రేటు జరిపిన విచారణలో అయ్యాసామి నిర్దోషి అని తేల్చారు. అయ్యాసామి విడుదల అయ్యాడు.

మేజిస్ట్రేటు నేరం చేసినవారు అయ్యాసామి తండ్రి వైద్యనాథపిళ్లె, అతని సవితిచెల్లెలుతంగం, సవతితమ్ముడు కల్యాణం అయిఉండాలనిఅన్నాడు. నేరస్తులతో కలిసి కుట్రచేసిన మరి కొందరితో కదిరేశన్ అనే నవుకరుకూడా ఉండిఉంటాడని ఆయన అన్నాడు.

**27 నవంబరు**

ఆయన చెప్పినవారందరినీ అరెస్టుచేశారు.

త్వరలోనే కొత్త విచారణ తంజావూరులో ప్రారంభమయింది.

ఈ విచారణలోనూ వైద్యనాథపిళ్లె నేరస్తుడుగా నిర్ణయించటం జరిగింది. అతనికి మరణశిక్ష వేశారు. పిళ్లె హయికోర్టులో అప్పీలు చేశాడు.

హయికోర్టులో బెక్‌వెల్, సదాశివ అయ్యర్లు న్యాయమూర్తులు. వీరు ఇద్దరూ ఒకే నిర్ణయానికి రాలేదు! బెక్‌వెల్ వైద్యనాథపిళ్లె నేరస్తుడన్నాడు, సదాశివ అయ్యరు అతన్ని నిర్దోషి అన్నాడు.

అందుచేత కేసుని శంకరన్‌నాయర్ అనే మూడవజడ్జివద్దకి పంపారు. ఈయన బెక్‌వెల్ నిర్ణయాన్నే బలపరిచాడు. వైద్యనాథపిళ్లెఅప్పీలునికొట్టిపారెయ్యాలన్నాడు.

ఆయన తన తీర్పులో ఇలా రాశారు—

'...అయ్యాసామి ఇచ్చిన సాక్ష్యం ఇది: 'అయ్యో నన్ను వదలండి!' అని తనభార్య కేకవెయ్యగా విన్నాడుట. ఆమె కేకలవల్లనే అతనికి మెలకువ వచ్చిందిట. తంగం, కదిరేశన్, తన తండ్రి ఇతరులు అక్కడే ఉన్నారుట. తన భార్యజోలికి రావద్దని తను వారితో అన్నాడుట కాని కొందరు సేవకులు తన తండ్రి ఆజ్ఞప్రకారం తనని మరొక గదిలోకి తీసుకువెళ్లి అక్కడ ఒక స్తంభానికి కట్టివేశారుట.

'కొంతసేపు తర్వాత అందరూవచ్చి తనని విడుదలచేశారుట. వైద్యనాథపిళ్లె కోడలిని కొట్టి శిక్షిస్తూ ఉండగా పొరపాటున కణత మీద దెబ్బ తగిలి ఆమె చనిపోయిందని అతనితో చెప్పారుట. అయ్యాసామికి రావలసిన ఆస్తితోబాటు మరికొంతకూడా ఇస్తామని అన్నారుట. ఇంతలో దహన క్రియలకి అంగీకరించమన్నారుట.

'అయ్యాసామి ఒప్పుకోలేదు. వారు వాదించుకుంటూ ఉండగా మునసబు సామి దేవ్ వచ్చాడుట. వైద్యనాథన్ సోదరుడికి ఏదో నచ్చచెప్పగా అతను అయ్యాసామితో 'జరిగిందేదో జరిగిపోయింది, పోయినవారు తిరిగిరారు, నీ తండ్రి చెప్పినట్లు చెయ్యి' మన్నాడుట.

'అయ్యాసామి అంగీకరించలేదు. ఇంతలో అక్కడ చాలామంది పోగయ్యారు. వైద్యనాథపిళ్లె, 'ఇదుగో ఈ పిచ్చివాడు భార్యని చంపేశాడు!' అన్నాడుట.

'సాక్ష్యమంతా పరిశీలిస్తే అయ్యాసామి చెప్పిన కథ నిజమనిపిస్తుంది.'

వైద్యనాథపిళ్లెకి మరణశిక్షపడింది. ●

# క్షేమేంద్రుని బృహత్కథామంజరి కథలు

అనువాదం: తిరుమల రామచంద్ర



## లోహజంఘుని అభిసారిక

[illegible] నేర్చుకోవడం ఆరంభించింది. శ్రుతుల హెచ్చింపు తగ్గింపులతో, ఆయా స్థానాలలో, ఆరోహణావరోహణ క్రమంతో, శ్రుతి జాతిక్రమం తెలిసి, తాళానుగుణంగా స్వరాలు సంపూర్ణంగా వీణపై పలికించే ప్రావీణ్యం సంపాదించింది.

గురువుకు శ్రద్ధాభక్తులతో శుశ్రూష కూడా చేసేది, ప్రేమతో, ప్రణయంతో ఆమె శుశ్రూషకు వత్సరాజు, సుధ తాగినవాడు అమరుడై ఇహలోక విషయాలే మరచినట్టు తనను, తన రాజ్యస్థితిని మరిచిపోయాడు.

వత్స భూపతి అవంతి రాజ్యంలో బందీగా చిక్కుకున్నాడని కౌశంబీ నగరానికి వార్త చేరింది. మంత్రులు పౌరులు చాల దుఃఖపడ్డారు. ఏ విధంగా అతనిని చెరనుంచి విడిపించడమా అని మహామంత్రి యౌగంధరాయణుడు తక్కిన మంత్రులతోను, సేనాపతితోను, పౌర ప్రముఖులతోను మంతనాలు జరిపాడు. అతడు చాల బుద్ధిమంతుడు, తంత్రం బాగా తెలిసినవాడు. తను ఉదయనుని నర్మసఖుడు వసంతకునితోపాటు ఉజ్జయినికి వెళ్లి ఉదయనుని విడుదలకు యత్నించాలని నిర్ణయించాడు రాజ్యపాలనం సేనాపతి మొదలయినవారికి అప్పగించి ఉజ్జయినికి బయలుదేరాడు. మంచితోడు ఆసదేసే ముళ్లతీగలను నరికే గొడ్డలివంటిది.

దారిలో భయంకరమైన వింధ్యాటవి వచ్చింది. సూర్యకిరణాలు కూడా చొరరానంత దట్టంగా పెరిగివున్నాయి మహావృక్షాలు, వింధ్యాటవిలో ఒకవైపు హింతాళవృక్షాలపై (గిరకతాటిచెట్లపై) కోతులు కొండముచ్చులు ఎగురుతూవున్నాయి. మరొకవైపు సల్లకీవృక్షాల (అందుగుచెట్ల) కొమ్మలను ఏనుగులు ఎంతో ఆప్యాయంతో తొండాలతో వంచి విరిచి తింటున్నాయి. మరొకచోట సింహాలు ఆవలిస్తున్నాయి. ఆవలిస్తున్నప్పుడు వాటి తెల్లటికోరల కాంతులు మెరుపుల్లాగ ఆ ప్రాంతంలో వ్యాపిస్తున్నాయి. అలాటి వింధ్యాటవి దాటి యౌగంధరాయణుడు, వసంతకుడు అరణ్య సమీపంలోని ఒక శబరుల పల్లెను చేరారు.

ఆ శబరుల పల్లెనాయకుడు ఉదయను మిత్రుడు. పేరు పులిందకుడు. అతడు ఆ చుట్టుపట్ల ఆటవికగ్రామాలకంతా

## బృహత్కథామంజరి

కూడా రాజా. యౌగంధరాయణుడు వసంతకునితోసహా ఆ పుళిందకుడిని కలుసుకున్నాడు. వత్సరాజు బంధనవార్త తెలియజేశాడు. ఎలాగయినా, ఆయనను బందెనుంచి తప్పించి పంపుతామని, అతనిని రక్షించి కౌశాంబికిచేర్చే కార్యశేషంలో సహాయంగా వుండాలనికోరాడు. పుళిందకుడు ఒప్పుకున్నాడు.

యౌగంధరాయణుడు అక్కడనుంచి ఉజ్జయినికి తరలాడు. పదిరోజులలో ఉజ్జయిని చేరాడు. యౌగంధరాయణుడు ఉజ్జయినిచేరింది రాత్రి. నగరపరిసరాలలో మహాకాలమనే పేరుగల భయంకరమైన శ్మశానం వుంది. ఆ శ్మశానం ఎక్కడ చూచినా, కపాలాల ముక్కలు కనిపిస్తూ, చితుల మంటలు ఛటఛటమని వినిపిస్తూ, బేతాళుడు ఆవహించి చిందులుతొక్క కంకాళాల కోలాహలం చెవులు చిల్లులుపడేట్లు చేస్తుండగా అతిభయావహంగా వుంది. ఆ రాత్రి వారిద్దరూ ఆ శ్మశానంలోనే బసచేశారు.

ఆ శ్మశానంలో వారికి యోగేశ్వరుడనే బ్రహ్మరాక్షసునితో చెలిమి కలిగింది. అతడు యౌగంధరాయణునికి స్వస్వరూపం మార్చుకొనే విద్యను, అంతర్హితుడయ్యే విద్యను నేర్పాడు. మహామతి అయిన యౌగంధరాయణుడు ఆ విద్యతో గుర్తుపట్టరానంతగా తనరూపం మార్చుకున్నాడు—బట్టతల, తలపై పంచశిఖలు, పెద్దపెద్ద దవడలు, వ్రేలాడేబొజ్జ, కురుచమెడ, మెడమీద మూపులలాగ మాంసపు ముద్దలు, ముసలితనం. సృష్టికర్త కూడ అతడు యౌగంధరాయణుడని కనుక్కోలేడు. యౌగంధరాయణుడు ఆ విద్యతోనే వసంతకుడిని కూడా గుర్తుపట్టలేనంతగా త్వరలో మార్చివేశాడు. వసంతకుని శరీరం ఏనుగులాగ లావెక్కి వికటాకారంపొందింది.

తర్వాత యౌగంధరాయణుడు కుంటుకుంటూ రాజవీధిలో నడిచాడు. వెర్రివాడివలె పాటలుపాడుతూ, నవ్వుతూ, తనలో తను ఏదో చదువుతూ, పరిగెత్తుతూ, నాట్యంచేస్తూ, జనాన్ని నవ్విస్తూ అటూ ఇటూ తిరిగాడు. పిల్లలు చప్పట్లు కొడుతూ, కేకలువేస్తూ అతని వెంట పడ్డారు. ఇలా జనాన్ని నవ్విస్తూ అతడు రాణివాసంలో కన్యలుండే కన్యాంతఃపురం ముందు తిరగడం మొదలుపెట్టాడు.

అంతఃపురకాంతలు, అతనిని నగరు తోరణగండ్లనుండి చూస్తూ ఆనందించారు. కొందరు చేటికలు ఆ వెర్రివానితో వాసవదత్తకు వినోదం కల్గిద్దామనుకొని, అతనిని ఆమె వీణ నేర్చుకొనే గాంధర్వశాలకు పిలుచుకొని వెళ్ళారు. తన చేష్టలతో వాసవదత్తకు వినోదం కల్పించాడు ఆ వెర్రివాడు. అతడు వెర్రిచేష్టలుచేస్తూ గాంధర్వశాల అంతటా వత్సరాజుకోసం వెతకనూ వెతికాడు.

గాంధర్వశాలలో నిర్బంధంలోవున్న ఉదయనుడు. విరాటుని అంతఃపురంలో ఉత్తరకు గురువయిన అర్జునునివలె ఉన్నాడు. అతనిని చూచి యౌగంధరాయణుడు దుఃఖంతో ఏడ్చాడు పిదప అతడు యోగబలంతో అంతర్ధానంచెంది రాజుతో రహస్యంగా సంభాషించాడు. తనువచ్చిన పనిని అతనికి తెలియజేశాడు. రాజు యౌగంధరాయణుని సాహసానికి చాల సంతోషించాడు యౌగంధరాయణుడు అతనికి చెరనుండి విడివడే కొన్ని కొన్ని ఉపాయాలు, విద్యలు చెప్పి అదనుకోసం వేచివుండమని చెప్పాడు.

యౌగంధరాయణుడు రాజకన్యను నవ్విస్తూ తనలాగే వికారస్వరూపుడయిన వసంతకునికూడ గంధర్వశాలకు పిలిపించేట్టుచేశాడు. వాసవదత్త వారిద్దరు మంత్రకోవిదుల చేష్టలకూ ఆనందిస్తూ వుండేది. నిజమే సిరిగలవారు, విపరీతంగా కనిపించేవారిపై ఆదరంతో వుంటారు. ఇలా వుండగా యౌగంధరాయణుడు వసంతకుడిని కన్యాంతఃపురంలో వదలిపెట్టి ఒకనాడు మాయమైపోయాడు.

ఒకనాడు పరిహాసానికి వాసవదత్త వసంతకుణ్ణి అడిగింది. 'బ్రాహ్మణోత్తమా నీకు ఏమి విద్యలు వస్తాయి?' అని. 'రాజకుమారీ నేను కథావేత్తలలో ధురంధరుణ్ణి' అని అతడు సమాధానమిచ్చాడు. రాజకుమారి నవ్వుతూ 'అయితే ఒక కథ చెప్పు' అని అడిగింది. వసంతకుడు తన వికారమైన నోరు తెరచి ఇలా చెప్పాడు:—

మధుర అనే నగరివుంది. ఇంద్రపురి కూడ దానిముందు తీసికట్టు. ఆ నగరి రుక్మిణిలాగ హరికి ప్రియమైనది. అక్కడ

పోరులు కీర్తిమంతులు. సౌధాలన్నీ వెర్లతో తెల్లగా అందంగావుంటాయి. వాటిని చూస్తే ప్రజల కీర్తితోనే అవన్నీ తెల్లగా వున్నాయా అనిపిస్తుంది. అంత తెల్లగా వున్న నగరాన్ని విష్ణువు శ్వేతద్వీపం అను కుని అక్కడే స్థిరంగావుండిపోయాడు.

ఆనగరంలో రూపిణి అనే వారకాంత వుంది. ఆమె—జనాన్ని ఆకర్షించే వశీకరణ చూర్ణంతో మన్మథుడు ఆమెను సృష్టించాడా అన్నట్టువుంటుంది. ఆమె లేడిపిల్ల కన్నులవంటి కన్నులు, పెద్ద చనుకట్టు ఎవరినైనా వశపరచుకొనేవి. రూపిణి తల్లి పేరు మకరదంష్ట్ర. అది వచ్చిన వాళ్లందరితోను కలహించేది. అందువల్ల ప్రతివాడూ దాని ముక్కు కోయడానికి ప్రయత్నించినవాడే. మాటలా శ్రవణ భీషణమైనవి. దాని తలకట్టంతా పోట్లాటలో పీక్కోనడం వల్లనే రాలిపోయింది. కాళరాత్రిలాగ భయంకరమయినది. వజ్రాయుధపు ధారలాగ గొంతుకోసే వ్యక్తి. చితిమంటలాగ వెరపు కలిగిస్తూ, కంకాళివలె (పిశాచి వలె) మనుష్యులను పీక్కుతినేది.

రూపిణి ఒకనాడు దేవాలయానికి వెళ్లినప్పుడు, అక్కడ ఒక అందగాడైన బ్రాహ్మణుణ్ని చూసింది. అతడు ఆకారంతోవున్న అనంగునిలాగ, రూపు తీర్చుకున్న యౌవనంలాగ మనస్సుకు ఆనందం కలిగించాడు. రూపిణి ఆదివరకు ఎందరో కాముకులను చూచినా, అతనిని చూడగానే ప్రత్యేకమైన ఆదరం పుట్టింది. ఇష్టం కలుగ లేగాని, ఇష్టం కలిగి ప్రీతి చూపినప్పుడు, ఎవరు అభిలాషపుట్టి లోబడనివారు! రూపిణి లతనివద్దకు తన దూతిని పంపి, అతని పేరు లోహజంఘుడని, ఏమీ లేనివాడని తెలుసుకున్నది. అయినా రత్న కాంతులతో చిత్రవిచిత్రంగావుండే తన ఇంటికి అతనిని బలవంతంగా పిలిపించుకుంది. తక్కిన సరసులందరినీ నిషేధించి అతనితోనే సుఖంగా గడపసాగింది.

ఇంటికి వచ్చినవారిని రాక్షసిలాగా కపాలమాంసంతోపాటు సర్వస్వం హరించే మకరదంష్ట్రకు తనకూతురి ప్రవర్తన గిట్టలేదు. కూతురు వలచినవాడు నిర్ధనుడు, చాలవాళ్లుగా ఇంట్లో తిష్ఠవేశాడు. అతనిని ఎలా వెళ్లగొట్టడం — అని ఆలోచించింది. తన కుమార్తెతో చెప్పింది:—'అమ్మాయి, ఐశ్వర్యంలేని ఇల్లు శోభించదు. వీధిలో జనం నిండుగా

విదుషీత్వం లేనే అందం. అలాగే వారవనిత ఇంటికి లోకులు యాత్ర సాగిస్తుండడమే శోభ. భర్త దరిద్రుడుగా వున్నప్పుడు గూడ అంటిపెట్టుకోవడం సతులకు శోభ. మనకు డబ్బుమూటలతోనే సదా సర్వకాలం నవనవోత్సవం. అభ్యాసంలేని విద్య, నూతన ప్రయత్నాలులేని రాజ సంపదలు, వేశ్యలు అనురాగవతులు కావడం హాస్యాస్పదమైన విషయాలు. అమ్మాయి, ఈ యౌవనమనేది నీటి తరగలలాగ త్వరగా కదలిపోయేది. ఈ యౌవనం సడలి పోతే, ఒక్కడైనా చిల్లిగవ్వ ఇవ్వడు. వేశ్య ఎలా వుండాలంటే, దృష్టచ్ఛటలాగ తీక్ష్ణంగాను, కనుబొమలాగా వంకరగానూ, చనుకట్టులాగా కఠినంగాను వుండాలి. అలాంటిదే సరసుల సర్వస్వమూ హరించగలుగుతుంది. ఎవరిమీదా ప్రత్యేకమైన కామం లేక, స్వేచ్ఛగా ప్రవర్తిస్తూ, కులంశీలం అనేది చూడక భోగిస్తూ, నిత్యం కానుకలు సంపాదించే వారకాంతలే పైకి వస్తారు. ఓ అమాయకురాలా, విచిత్రమైన మాయలతో, మనుష్యులను మోహావలి కట్టివేస్తూ వున్న మన బోటిది ఈ సంసారంలో మరొక సంసారం వంటిది. చెవిలో దూరిన నీటిని మరి కొంచెం నీరుపోసి పైకితీసినట్లుగా చతురులయిన పణ్యాంగనలు కొద్దిపాటి ఉపచారమనే డబ్బు మదుపు పెట్టి సరసుల నుంచి హెచ్చుడబ్బు లాగుతారు. నవ్వు, నృత్యం,

## ...బృహత్కథామంజరి

ఏడుపు, రాగం, రూఢి, ఉదాగత, ఇదంతా వారకాంతలకు స్వప్నంలో చూచిన దృశ్యాలలాగ అసత్యం. కొత్తగా వచ్చిన సరసుడు కౌగిట్లో కులాకులత పడగా గణిక అతనిని మోసం చేసి ఎన్ని ఇళ్ళు సంపాదిద్దామనే ఆలోచనలో పడుతుంది. అందువల్ల రాజుల నుండి డబ్బు గుంజడానికి ప్రయత్నించు. డబ్బులేని వేశ్యలు గడ్డిపోచకు కూడ కొరగారు నా చక్కని చుక్కా, డబ్బు కోసం జనం ఏంతపనైనా చేస్తారు. కత్తిమీద సాముచేస్తారు; సముద్రంలో దూకుతారు. మనం ఇతరులకు సుఖమిచ్చి ధనం సంపాదిస్తున్నాము; ధన్యులమనుకో. చేతులు అమ్మినా, తల అమ్మినా డబ్బు రాదమ్మాయి. ఈ సిగ్గుబిడియాలు వదలిపెట్టు. వీడిరూపానికి లోబడవద్దు: కర్ర ఏనుగు యుద్ధానికి పనికి వస్తుందా?'

తల్లిమాటలకు రూపిణి కోపంతో ఊగిసలాడి పోయింది. లోహజంఘుని మీద దృఢానురాగం వుండడంవల్ల 'మళ్ళీ ఇలా అనేవు, జాగ్రత!' అని తల్లిని హెచ్చరించింది.

మకరదంష్ట్ర మరొక ఉపాయం పన్నింది. ఒకమారు ఒక రాజపుత్రుడు ఆ దారిని వెళ్ళుతుండగా ఆ ముసలిది అతనికి తన గోడు చెప్పుకొని, ఆ నిర్ధనుడైన బ్రాహ్మణుణ్ని తన యింటి నుంచి వెళ్ళగొట్టమని కోరింది. రాజపుత్రుని సేవకులు. లోహజంఘుణ్ని మెడపట్టి ఇంటి నుంచి వెలుపలికితోసి, దుడ్డుకర్రలతో బాగా బాది, ఒక బురదగుంటలో తోసి పోయారు.

లోహజంఘుడు ఎట్లో ఆ గుంటలో నుంచి పైకివచ్చి అడవిదారి పట్టాడు. పైన ఎండ మాడ్చివేస్తున్నది. లోపల రూపిణి వియోగ సంతాపదుఃఖం దహించివేస్తున్నది దీనుడై, ఏమీతోచక నడిచి పోతున్నాడు. నీడలో సేదదీర్చుకుందామనుకున్నాడు. నీడయిచ్చే పెద్ద చెట్టేదీ కనిపించలేదు కాని, చచ్చిపడిన ఏనుగు కనిపించింది. నక్కలు దానిని కొంత పీక్కుతిని వదలిపెట్టాయి. క్రిమికీటకాలు దానిలోని మాంసాన్ని తినివేశాయి. చర్మంమాత్రం కనిపిస్తూ, లోపల డొల్లగా వుంది. అక్కడక్కడ చిల్లులుపడ్డాయి. లోహజంఘుడు దానిలో దూరి పడుకున్నాడు. చిల్లుల గుండా గాలిపారడంవల్ల అతనికి నిద్ర పట్టింది

అప్పుడు హఠాత్తుగా చీకటి మూకల నీడవంటి కారుమబ్బులు కమ్ముకున్నాయి. కుండపోతగా వానకురిసింది. దిక్కులన్నీ జలసంకులమయాయి. వెల్లువలు పారాయి. వెల్లువలలో లోహజంఘుడున్న ఏనుగు కొట్టుకొనిపోయి నదిలోపడి, నది అలల వేగంతో సముద్రం చేరింది. సముద్రంలో తేలుతున్న ఆ ఏనుగును చూచి గరుడ వంశంలో పుట్టిన మహాపక్షి ఒకటి మాంసం మీది ఆశతో దానిని కాళ్ళతో తన్నుకొనిపోయి, అవలిగట్టుమీద పెట్టి ముక్కుతో పొడిచి తినబోయింది అప్పటికి లోహజంఘుడు మేల్కొని మహాకాయమైన ఆ పక్షిని చూచాడు. గాబరాపడి లేచాడు. గరుడపక్షికూడా ఆ గజకళేబరంలో బ్రతికిన మనిషి వుండడం చూచి భయపడి అక్కడే వదలిపెట్టి ఎక్కడికో తన దారిని ఎగిరి పోయింది.

లోహజంఘుడు ఏనుగుడొల నుంచి వెలుపలికివచ్చి చూచాడు. కొత్తదేశం. కొత్త జనం. కనుక్కొగా లంకాద్వీపం అని తెలిసింది. రాక్షసులు ఏమిచేస్తారో ఏమో అని భయపడిపోయాడు. సరే, ఏమైతే అదే కానిమ్మనుకొని లంకాధిపతినే దర్శిద్దామను

(63వ పేజీ చూడండి)



**ఒకవారం విపరీతం**

# మేధావులను ఉత్పత్తిచేసే ప్రయోగం!




హేమ్బర్గ్‌లో సైకాలజీ (మనస్తత్వశాస్త్రం) శాఖవారు అత్యద్భుతాన్ని పరిశోధింప నిర్ణయించారు ఇంజక్షను ద్వారా తెలివితేటలను మనిషిలోకి ప్రవేశ పెట్తారట. దీనికి పరిశోధనలు జరుగుతున్నాయి కరంటు అమర్చిన ఒక బోనులో ఆహార పదార్థం అమర్చి తెల్లఎలుకను వదులుతారట. బోనులో తెల్లబల్బు వెలుగుతుండగా యీ ఎలుక వెళ్ళి ఆహారం తేచ్చుకోవాలి. ఆలోగా ఎర్రబల్బు వెలిగితే చిన్న షాకు తగుల్తుందట. ఇలా షాకు తినగా తినగా చివరికి ఎర్రబల్బు వెలిగేలోగా ఆహారం తెచ్చేసుకునే తెలివి వస్తుందట. అప్పుడా ఎలుకన్ను చంపి మరో కొత్త ఎలుకకు దాని మెదడులోని కొన్ని పదార్థాలను ఇంజక్షను ద్వారా ఎక్కిస్తే—కొత్త ఎలుక మొట్టమొదటిసారే ఎర్ర బల్బు వెలిగే లోగా ఆహారం తెచ్చుకుంటుందట. ఇది ఫలిస్తే లోకం మేధావులను తయారు చేస్తుందిట. (ఏ మేధావిని చంపి బుర్రలో మెదడు మరోవ్యక్తికి ఎక్కిస్తారో—మనకి అర్థంకానిదే సైన్సు)

## ప్రయాణీకుల అపహరణ

ఆగ్రా—బీరాఘర్ బస్సును ఓరాఘర్ రోడ్డు వద్ద గూండాలు ఆపి, తుపాకి చూపించి దిగమన్నారట అదే బస్సులో ప్రయాణం చేస్తున్న మహావీర్ సింగ్ అనే సబ్‌ఇన్‌స్పెక్టరు ఆ గూండాలను సవాలు చేసేసరికి గూండాలతన్ని కాల్చి చంపేసి, 20 మంది ప్రయాణీకులను అపహరించుకుపోయారట—ఇది ఏప్రియల్ 11వ తేదీన జరిగింది.

## ఎక్స్‌ప్రెస్‌కి నిప్పు

పఠాన్‌కోట ఎక్స్‌ప్రెస్ ఒక బోగికి వున్న ప్పొండి నిప్పంటుకుని ఓ ఏడుగుర్ని పొట్టన పెట్టుకుందట. హజారీబాగ్‌కి సమీపంలో వున్న బిబాకి అనేచోట ఏప్రియల్ 14 న జరిగిన యీ విపరీతానికి కారణాలింకా బయల్పడలేదు.

## యాభైమందికుటుంబం

మాస్కోలో గాడివన్ క్విన్స్ అష్విర్లీ అనే అతను 80 ఏళ్ళ తన వివాహ జీవితానికి ఓ ఉత్సవం జరుపుకున్నాడట. అతనికి నూటపదేళ్ళట. ఈ 110 ఏళ్ళ జీవితకాలంలో ఒక్కసారే జ్వరున చీదాడట.




అతని భార్య అదీ లేదట. ఈ దంపతుల యిద్దరాడపిల్లలు, 13 మనవలు (మనవరాండ్రు) 5 మునిమనవలు, ముప్పయిమంది మేనల్లుళ్లు, మేనగోడళ్ళు వెరసి యాభైమంది యీ వుత్సవంలో పాల్గొన్నారట—ఆతడు ధన్యజీవి కదా!

## మరుగు దొడ్డిలో యువకునిశిరస్సు

వారణాసి నుంచి బొంబాయి చేరిన (13వ తేదీ) ఎక్స్‌ప్రెస్ బండి మూడవ తరగతి ప్రయాణీకుల బోగిలోని మరుగు దొడ్డిలో ఒక యువకుని శిరస్సు దొరికిందట. ఆ శిరస్సు ఒక డబ్బాలో వుందట. ఆ దుర్గంధం వచ్చేసరికి మురుగుదొడ్డి శుభ్రంచేసే వ్యక్తి ఆడబ్బాతీసి చూశాడట. హత్య గొడ్డలితోనో, బలమైన కత్తితోనో జరిగివుండాలని —జరిగి70 గంటలయినా అయ్యుండాలనీ అన్నారు. అతను పాతికఏళ్ళ యువకుడుట. పచ్చనిఛాయ, అందమైన ముఖం— ఈలాటి దారుణభయంకరచర్యలు చేసిన ఘాతుకులకు (లేక 'నికి') ఎలాటి శిక్ష విధించాలసలు?

## సజీవ సమాధి

అశోక్‌నగర్ (హైదరాబాద్) ప్రాంతంలో 14 ఏళ్ళ, 12 ఏళ్ళ యిద్దరు ఆడపిల్లలు భూమి కృంగి, సజీవంగా సమాధి అయిపోయారట (ఏప్రియల్ 11వ) ఇంకో యిద్దరు వ్యక్తులు మాత్రం తప్పించుకున్నారట. భూమిని ఓ చోట త్రవ్వుతుండగా యీ సంఘటన ఏర్పడిందట.

## కుక్కల్ని తిన్న పులి

హబువాదా, సేవక్ (కార్వార్ సమీపం) గ్రామాలలో జనులు భయంతో కరుడుగొట్టుకుపోయారట. పెద్దపులి ఒకటి ఆ ప్రాంతాలకు షికారుకు వస్తోందట. మొరగడానికి ఒక్కకుక్కయినా లేకుండా (మరి అన్నీకాదు) కుక్కల్ని తినేసిందట. మనుష్యులనూ తిందట. పోనీ చంపి పారెద్దామా అంటే ఆపులి "రక్షిత ప్రదేశం వేట నిషిద్ధం" అనే ప్రదేశానికి చెందినదట. ఈ విషయం ప్రభుత్వానికి తెలియజేయబడిందట. కార్వార్ జిల్లాలోనే హనోవర్ తాలూకాకు చెందిన గ్రామాలలో ఓ డజను




ఏనుగులు వీరవిహారం చేస్తూ పొలాలను సర్వనాశనం చేసి, గ్రామాలమీద పడ్డాయట. ఓ మనిషిని 'మట్టి', చంపిశాయట. ప్రభుత్వం చర్య తీసుకోడానికని నివేదిక కోసం వో కమిటీని వేసుంటుంది ఈ వార్త మార్చి మధ్యభాగంలోది అయితే ఏం!

—ఫాలాక్షుడు ●

**ఎన్. పి, హనుమకొండ**

పుట్టినింటినుండి మొదటిసారిగా మెట్టినింట కాలిడబోయే ప్రతి స్త్రీ ఏమి కోరుకుంటుంది?

అత్తగారింటిలో పుట్టినింటివారికి ఆదరణ లభించాలని.

**ఎస్. ఆర్. హైదరాబాదు**

నేను పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాను. కాని నేటి పత్రికల్లో కార్టూనులు చూస్తూంటే భయం వేస్తుంది ఏమి చేయమంటారు?

బొత్తిగా పసివాడిలాగా బొమ్మలు చూసి దడుసుకోవడం బాగులేదు తమ్ముడూ, అయినా అవి మీ మగవాళ్ళు వేసేవేగా!

**పి. కె వి, విజయవాడ**

మనం ఒక విషయం ఎదుటివాళ్ళకి చెప్పవలసినప్పుడు — చెప్పకుండా ఊరుకోకుండా, చెప్పి బాధపెట్టకుండా ఉండాలంటే ఏం చేయాలి?

అదే కర్ర విరక్కుండా పాము చావకుండా అంటారు. దాన్నే డిప్లొమసీ అని కూడా అంటారు.

**ఎ ఎల్. ఎన్. బొంబాయి**

సినిమాలో అంత అందంగా ఆకర్షణీయంగా కన్పించే అలంకరణే నిజజీవితంలో అసహ్యాన్ని ఏహ్యాన్ని కల్గిస్తుంది అఘోరకం జుగుప్స కూడా కల్గిస్తుంది. ఎందువల్ల?

సినిమాలలోని అలంకరణ కెమెరా కన్నుకోసం చేసినది. మామూలు కంటితో చూస్తే అందుకేఅలా ఉంటుంది.

**వి. కె. ఎస్, కోటనందూరు**

ఈ మధ్య నాకో సంబంధం వచ్చింది. అన్నీ బాగానే ఉన్నాయిగాని అబ్బాయికి నాలుగు కళ్ళు ఎలా?

వెలసులభం అని గుడ్డివి పెళ్ళాడే కంటే ఇది మేలురు కదూ!

**ఎస్. జి, తలారి**

ఇతరదేశములన్నీ అభివృద్ధి చెందినట్లుగా మన భారతదేశం ఎప్పుడు అభివృద్ధి చెందుతుంది!

స్వంతలాభం కొంతతగ్గించుకొని దేశ సౌభాగ్యం కోసం నిజంగా కార్యకర్తలు తలపెట్టినప్పుడు.

**డి. ఎన్, విజయనగరం**

అపరిచితులను ఏ విధంగా పరిచయం చేసుకోవాలి? ఆ పరిచయం ఏ విధంగా ఉపయోగపరుచుకోవాలి?




చిరునవ్వే పరిచయాలకి ఎప్పుడూ నాంది. ప్రతి పరిచయానికీ ఏో పరమార్థం ఉండదు. అలాగే ప్రతి పరిచయం అవసరానికి వాడుకోడానికే అయితే— కొంతకాలానికి మీకు పరచయస్థుల కరువువస్తుంది!

**పి హెచ్ పి, బూర్గుంపాడు**

ఇది రహస్యమే అయినా బయటపెట్టక తప్పదు. నన్ను ఒకరికి తెలియకుండా ఒకరుగా, ఇద్దరమ్మాయిలు ప్రేమించారు. పెళ్ళి చేసుకుందామనుకుంటున్నారు. నేను ఇద్దరినీ బాధ పెట్టలేను. పెళ్ళి చేసుకోలేను. ఎలా?

కనీసం మీరెవరినైనా ప్రేమిస్తున్నారా అదీ లేదా!

**ఎన్. ఎమ్, తణుకు**

రేడియో ఆన్ చేస్తే చాలు కుటుంబ నియంత్రణ మో అని ఒకటే గోల. ఇంతకీ మన ప్రభుత్వం ఇందులో ఎంత సాధించకల్గారు?

కుటుంబనియంత్రణం ప్రజలకిగాని ప్రభుత్వానికికాదు సోదరా, మనం ఏం సాధించాం అని అడగండి.

**ఎమ్. ఆర్ ఎమ్, మద్రాసు**

కొందరు ప్రేమించడం నేరం అనుకుంటా రెందుకండి?

కూడనిచోట ప్రేమించడం నేరమవుతుంది.

బ్రతుకు చీకటి అయిపోయాక బ్రతకడం ఎలా?

వెలుగుకావాలంటే దీపం వెల్గించే ప్రయత్నం చెయ్యడమే.

ఆడవాళ్ళ కోపానికీ మగవాళ్ళకోపానికీ తేడా ఏమిటి?

ఇద్దరికోపం ఒకటే. కాని ఇద్దరూ ప్రదర్శించే తీరులోనే ఉంటుంది తేడా.

చిన్న పిల్లాడిగానే ఉండిపోతే మంచిది. కష్టాలని ఎదుర్కోనక్కరలేదు

అలా అంటే ఎలా? వాణ్ణే నా ఎవరేనా చూడాలి కదా!

**పి, ఆర్, పి, ఆముదాలవలస**

నేటి మన దేశనాయకులు దేశాన్ని మట్టి అని భావించి పరిపాలిస్తున్నారా? ప్రజలుగా భావించి పరిపాలిస్తున్నారా?

వోట్లుగా లెక్కకట్టి— పాలిస్తున్నారు.

**ఎమ్. వి. ఆర్. బి, ఉరవకొండ**

సాంఘిక నియమాలకీ వ్యక్తి ధర్మానికీ సంఘర్షణ ఉన్నదా లేదా?

సాంఘిక నియమానికి వ్యక్తిగత నియమాలకీ సంఘర్షణ ఉండొచ్చు. కాని సంఘనియమాలకీ వ్యక్తి ధర్మాలకీ సంఘర్షణ ఉండదు—వస్తువేకదా సంఘం?

**జి. ఆర్. హెచ్, మైసూరు**

ఉదయం రాద్దాంలే అనుకుంటూ నిద్రాదేవి వడిలో జారుకుంటే మర్నాటికి పారిజాతాల్లాంటి భావాలు చెదిరి విశీర్ణమైన మనసు శూన్యంగా తోస్తుంది. ఎందుచేతనంటారు?

పారిజాతం ఒక్కపూటేపూసి వూరుకుంటుందా ఏం? మర్నాటి కొత్తమొగ్గల సంగతి మరచిపోకండి.

**టి, ఆర్. బి, ముపుకాల**

మనసులోని అభిప్రాయాలను వ్రాత ద్వారా వెల్లడించాలంటే సాధ్యం కావడం లేదు.

భావాలకి రూపం ఉండదు. అక్షరాలలో వాటిని పొదిగి వోరూపం కల్పించాలని చూడ్డం—చాకచక్యమే....సాధనవల్ల సమకూడే కళ అది.

**పి. ఎన్. ఎమ్, చిట్వేలి**

మీకు అల్లుణ్ణి కావాలని ఉంది అంగీకరిస్తారా?

ఇంటల్లుడా?.... కట్నం అల్లుడా?— అలాంటివి మా ఇంటావంటాలేవు. క్షమించాలి.

**ఎన్. పి, జగత్యాల**

స్త్రీ పునర్వివాహం జరిపించడం హిందూమత సంప్రదాయాన్ని కించపరచడము కాదా?

మీరేయుగపు మనిషి స్వామీ?

**ఆర్. ఆర్, వేలూరు**

నేను మేనమామ కొడుకును ప్రేమించాను. అతనూ నన్ను ప్రేమించాడు. కాని నాన్నగారు నాకు వేరే సంబంధాలు చూస్తున్నారు ఏం చేయాలి?

బాగుంది. బావని చేసుకుంటానని అనడానికి కూడా ధైర్యం కావాలా? ●

# టిసి. అమోఘం



యర్రంశెట్టి శాయి

అమోఘరావు తెల్ల రైల్వే కోటు తొడుక్కొంటూంటే, సరస్వతి అన్నం గరిటెతో సహా హాల్లోకి వచ్చేసింది.

'ఇదిగో! మీకు మళ్ళీ వార్నింగిస్తున్నా...పాపాయిని మళ్ళీ స్టేషన్లో టికెక్కడిగారంటే బావుండదంతే..'

'బావుండదే నీ గొడవ! అది నా డ్యూటీ! మీ చెల్లాయిగదాని టికెక్కట్టడగద్దేమిటి?'

'ఆ! చేశారులేండి పెద్ద డ్యూటీ! దానికి సీజను టికెట్టుందని తెల్సి అడగడమేమిటి?...మిగతావాళ్ళందర్నీ అడగరేం మరి?...'

'ఛవ్! నేను వీయినంతమంది సీజన్ టికెట్లు చెక్ చేస్తుంటాను తెల్సా? అందుగ్గాపతే షేముంది దేంకేం అక్కడ?'

'ఆ! ఈ ప్రపంచంలో మీరొక్కరే చేస్తున్నారు ఈ ఉద్యోగం! పోనీ బావగారుగదాని ఊరుకోంటోందది ..'

'లేకపోతే ఏం చేస్తుందేం?'

'ఏం చేస్తుందా?...మొన్న పేపర్లో చూడలా! బాంబేలో మీలాంటి టి. సి. ఒహతను, రోజూ ఓ చక్కటి పిల్లదగ్గర టిక్కెట్ చెక్ చేస్తూ, అయిదు నిమషాలు నుంచోబెట్టడం మొదలెట్టాట్ట! నాల్రోజులాగి, అయిదోరోజు టిక్కెట్టడగ్గానే, ప్రక్కకు పిలిచి చెంప ఛెళ్ళు మనిపించి వెళ్ళిపోయింది. తెల్సిందా?...అనక మీ యిష్టం! మళుదలు చెంప దెబ్బ కొట్టిందని తర్వాత గోలెడితే లాభం లేదు...'

అమోఘరావు గొల్లున నవ్వేశాడు.

'అవునే!...ఇలా ఆడపిల్లల బెదరింపులకి దడిస్తే, మేమిక ఉద్యోగాలు చెయ్యాల్సిందే! నేనసలే స్ట్రిక్ట్ మనిషిని ... టికెట్ లేకుండా మీ నాన్నొచ్చినా, ఆఖరికి నువ్వొచ్చినా సరే...ఛార్జ్ చేసి పారేస్తానంతే! తలుపేసుకో...టైమయింది పోతున్నాను...'

'ఆ! ఈ పడిపోయే రైళ్ళకి టికెట్టొక్కటే తక్కువ...మా నాన్నేం మీలా టికెట్టుకి మొహం చూసుకొనే రకంకాదు. మీ రడక్కముందే మీ మొఖాన విసిరి కొడతారు.' చర చరా లోపలికి పోయింది సరస్వతి.

అమోఘరావ్వాళ్ళ నాన్న కలెక్టరుద్యోగం చేసి రిటయిరయి పోయాడు. ఆయన చాలా 'రూల్స్' మనిషి. 'ఇంచం' అనే మాట

వినబడితే వారం రోజులు వాంతులయ్యే వాయనకి. ఆ మాటన్నవాడినీ, అనిపించిన వాడినీ, ఇద్దరిమీదా వాళ్ళు పెన్రోజులు మంచం పట్టేంత 'ఏక్షన్' తీసుకొనే వాడు. అంచేత ఆయన్పేరు చెబితే, చెప్పక పోయినా సరే, నిద్రపోతున్న అఫీసు ఫైళ్ళు, సదర్న్ ఎక్స్‌ప్రెసంత స్పీడులో పరిగెడుతుండేవి. ఏ ఫైల్ మీద ఎప్పుడు దండయాత్ర కొస్తాడోనని గుమాస్తాలందరూ వణుకుతూ, ధైర్యంకోసం ఆంజనేయస్వామి ఫోటోలు డస్క్‌లలో పెట్టుకొంటూండే వాళ్ళు.

సర్ప్రయిజ్ చెకింగ్ ఇచ్చేసి, సీట్లో లేకుండా, నారాయణ హోటల్ ముందు నుంచొని బాతాఖానీ కొడుతూండే అప్పినాథాన్ని వారంరోజులు సస్పెండ్ చేశాడని ఓ రోజూ, సీట్లో ఉండే నిద్రపోతున్న ఏడుకొండల్ని బెంకిజెల్లకొట్టి, నిద్ర లేపి వార్నింగిచ్చాడని మరో రోజూ, ఫైల్సు వతల పారేసి వారపత్రిక చదువుకొంటూన్న విస్సిరాజుని పద్నేరోజులు కంపల్సరీ 'లీవ్' పెట్టించాడని ఇంకో రోజూ...ఇలా ఆయన్ను గురించి రోజూ ఏవో వార్తలొస్తూండేవి.

అంచేత తిరణాల్లో, ఎక్కడపడితే అక్కడ గుంపులు గుంపులుగా నుంచొని 'హస్కు' దంచేస్తుండే ఆఫీసులవాళ్ళందరూ, పదిన్నర కొట్టగానే ఎవరి సీట్లలోకి వాళ్ళు దూకేస్తుండేవాళ్ళు...

# టి. సి. అమోఘం

ఇదిలా ఉన్నట్లుండగా ఆయన కోరోజు ఓ ఆలోచన వచ్చింది. తన తరువాత తనంత 'స్ట్రిక్ట్' మనిషెవరూ అని! వెంటనే ఆయన కళ్ళకి బి.ఏ. ఫైనలియర్ చదువుతోన్న సుపుత్రుడు అమోఘరావు కనబడ్డాడు.

మర్నాటినుంచీ ఆయన అమోఘరావుకి 'రూల్సు' మనిషిగా తర్ఫీదివ్వడం మొదలెట్టేడు. రెండేళ్ళు తిరక్కుండానే అమోఘరావు రూల్సుమనిషయికూచున్నాడు 'రూల్స్'లో వాళ్ళ నాన్నకంటె నాలుగాకులెక్కువే చదివేశాడు. 'స్ట్రిక్ట్' మనిషయి పోవడంచేత అతను బి.ఏ. ఎగ్జామిన్స్‌లో కాపీ కొట్టలేదు. అంచేత నాలుగేళ్ళయినా అది పాసవలేకపోయాడు. చాలా కష్టం మీద అయిదోసారి అది కాస్తా అయిందనిపించేసరికి, ఓకేసులో మరీ 'స్ట్రిక్ట్'గా పవ్జేసినందువల్ల వాళ్ళ నాన్నకి 'కంపల్సరీ రిటయిర్‌మెంట్' యిచ్చేశారు. ఆ బెంగతో ఆయన మంచమెక్కేసి, బాంకులో ఉన్న కష్టార్జితమంతా కొన్రోజుల్లో ఖర్చెట్టేశాడు. తరువాత ఆ సంగద్దెల్సి ఓ రోజు 'రజేర్'మని చచ్చిపోయాడు. పోయేముందు కొడుకేశ్వరావుని దగ్గరకు పిల్చి 'చిట్టీ! నూవూ మాంచి 'స్ట్రిక్' కలక్టరయిపోయి నా పేరు నిలబెట్టెయ్! పని తొందర్లో మర్చిపోయేవ్...ఏం?' అనేసి అలా అన్జెస్సి ఓ చిన్న సైజు వాగ్దానం లాంటిది తీసేసుకొన్నాడు.

ఆతరువాత అమోఘరావు కలెక్టరుద్యోగంకోసం వెదికి పంచదారలా అది దొరికే హోప్ కూడా కనబడక ఓ ముహూర్తంలో టికెట్ కలెక్టర్ ఉద్యోగం సంపాదించేసి 'నాన్నా! మీరు చెప్పినట్లు కలెక్టరుద్యోగం దొరకలేదు గాని టికెట్ కలెక్టరుద్యోగం దొరికింది. 'డజన్ట్ మేటర్'! మీ పేరు ఈ ఉద్యోగంలోనే నిలబెట్టేస్తాను. . ఇక చూస్కోండి !...' అనేశాడు. అనేసి చాలా ఖచ్చితంగా రూళ్ళమీద నడవడం మొదలెట్టేడు.

నెంబరు త్రీ ప్లాట్‌ఫారంమీద యేదో పాసింజెరు బండి వచ్చి ఆగింది. గేటుదగ్గర నుంచొని టిక్కెట్లు తీసుకొంటున్నాడు అమోఘరావు. కాసేపటికి రష్ తగ్గిపోయింది ప్రక్కనున్న స్టూల్ మీద టిక్కెట్లు 'నిప్' చేస్తూ కూచున్నాడు

ఇంతలోనే ఓ అమ్మాయి వయ్యారంగా నడుస్తూ గేటు బయటకు వెళ్ళబోయింది.

'టికెట్ ప్లీజ్!' అన్నాడు అమోఘరావు

రక్కున ఆగిపోయిందా అమ్మాయి. అమోఘరావంక చాలా సిల్లీగా చూసి కొద్దిగా నవ్వేసింది. 'ఫో మావా!... సరసాలూ...' అనేసి ముందుకి నడవబోయింది.

అమోఘరావు లేచి నుంచొని చాలా సీరియస్‌గా అడిగాడు.

'టిక్కెట్టడుగుతోంటే సరసా లంటావేమిటి? టికెట్ లేదా?'

ఆ అమ్మాయి కిలకిలా నవ్వేసింది. నవ్వేసి కొద్దిదూరంలో టేబుల్ ముందు కూచొని టి. సి. ఆర్ వ్రాసుకొంటున్న మరో టి. సి. ప్రసాద్‌నుద్దేశించి అంది:

'సూడు మావా! నన్ను టికెట్టడుగుతున్నాడూ!... అయిదేళ్ళమట్టీ, రోజూ రైల్లో పట్నం వచ్చి మా వూరు పోతున్నాను... ఇయ్యాల్టివరకూ టికెట్టే కొన్నేదు ఓరూ అడగనుకూడా లేదు...'

ప్రసాద్ తనూ ఇలా నవ్వేసి 'మనోడు ఈ గేటుకి కొత్తలేవే నాంచారమ్మా! ఒరేయ్! అమోఘం! వదిలెయ్యరా బాబూ! దొరక్క దొరక్క ఈ కేసే దొరికిందా రసీదు చెయ్యడానికి...అదిగో అక్కడెవరో మామ్మగారు బండి దిగికూర్చుంది.



పెమానెక్కువున్నట్లుగా వుంది. 'అన్‌బుక్డ్ లగేజ్' క్రింద ఛార్జిచేసి పారెయ్..'

ఈ మాటల్తో అమోఘరావుకి వాళ్ళ వాన్నంత కోపం వచ్చింది

'ప్రసాద్ ! మైండ్ యువర్ బిజినెస్ ! ...ఇలా టికెట్లేనివాళ్ళని వదిలేస్తే, మనం దేనికో మరి జీతాలు దండుగ !... అదేం కుదర్దు నువ్వు డబ్బుకట్టాలమ్మాయ్...' ఫేర్స్ బుక్ తీసి చూస్తూ అన్నాడు.

ఈ మాటల్తో ఆ అమ్మాయి కూడ సీరియస్ అయిపోయింది.

'ఏంటయ్యోవ్ ! డబాయిస్తుండావే!.. ఇలాంటివి సాలా సూశా !...' అంటూ ముందుకి చొచ్చుకుపోయింది.

అమోఘరావు కేం చేయాలో అర్థం కాలేదు

'ఏ యమ్మాయ్ !...ఆగు !... ఆగకపోతే పోలీసుల కిస్తాను...'

అప్పటికే నాంచారమ్మ వదడుగులు వేసేసింది.

పరిగెత్తుకెళ్ళి ఆమె చెయ్యి పట్టుకు ఆపబోయాడు అమోఘరావు.

నాంచారమ్మ ఛటాలున చెయ్యివెనక్కు లాక్కోడం, పిండి మర బెల్టులా చేతిని అమోఘరావు చెంపమీద తిప్పడం, నీటి చుక్కలు పడిన లాంతరు చిమ్నీలా అతని చెంప 'ఠాప్' మని ప్రేలడం యివన్నీ తెలుగు సినిమా చివరి సీనులా చక చక జరిగిపోయినయి. కాపోతే కొద్దిగా నేచురల్‌గా వుంది. ఆ తరువాత సీను కూడా చాలా సహజంగా వుంది. అప్పటి కప్పుడే నలుగురు పాసెంజర్లు పోగడ్డారు.

నాంచారమ్మ గొంతు హార్మోనియంలో ఆఖరి రీడ్ నొక్కేసినట్లు అరుస్తోంది.

'వచ్చివోడా!... టికెట్టుచ్చుకోంటూ చెయ్యట్టుకోంటావా?...నా అంబొండిప్పు డిక్కడుంటే నీ ప్రాణం తీసును. ఏటను కొన్నావేటోనూ! నా అక్బొండెవరను కొన్నావురా?... వాలువిరాద సూరిగాడు ... సీలాటోళ్ళారుసురిని, తోటకూరకాడల్లా ఇరిచేడిప్పటికి జాగత్త... వొల్లు దగ్గ రెట్టుకు బతుకు..'

వచ్చినోల్లొరూ కూడా డైలాగు విసిరేరు.

'అమ్మమ్మమ్మా!... ఇతగాడ్నిలా వదిలేస్తే లాభం లేదండీ... ఇవాళ ఆ పిల్లయింది.

# టి. సి. అమోఘం

లేవు మరొళ్ళవుతారు...అంచేత వాడిమీద రిపోర్టు వ్రాసేసి అందరం పంత కాలేట్టేసి పైకి గుద్దేస్తేసరి ... తిక్కకుదుర్తుంది...' కాసేపయాక అందరూ వెళ్ళిపోయారు. నాంచారమ్మా వెళ్ళిపోయింది. అమోఘం చెంపమీద నాంచారమ్మ అయిదువేళ్ళు కూడా పైకి తేలిపోయినయి ప్రసాద్ కిసుక్కున నవ్వాడు.

'ఒరేయ్ అమోఘం! వద్దురా అంటే విన్నావ్ ...అదనలేనిసింద్రీరాబాబూ! రౌడీ నూరిగాడుంచుకొన్నాడు దాన్ని... అదెళ్ళి సంగతి వాడితో చెప్పిందంటే, డ్యూటీ దిగ్గానే నిన్ను స్టేషన్ బయటపట్టుకొని 'టిబోపాల్' పెట్టి ఉతికేస్తాడంతే...' అంచేత వెధవ 'స్ట్రిక్టుతనం' పోకు...' అమోఘరావుకి అదివరకే వళ్ళుమండి వుంది. ప్రసాద్ మాటల్తో పిచ్చెక్కి పోయింది.

'పోర్మయ్! నా యిష్టం!... నా డ్యూటీ నేను చచ్చినట్లు చేస్తూంటాను అనక చచ్చినాసరే...ఆ!..' అనేసి చరచర ప్లాట్‌ఫారం మీదకి వెళ్ళిపోయి మిగిలిపోయిన పాసింజెర్ల దగ్గర చెకింగ్ మొదలెట్టేశాడు.

ఆ కోపంలో మూడేళ్ళ వారం రోజుల పదునుగల టికెట్టులేని ఓ కుర్రాణ్ణి, పాసింజెర్ కారేజీలో కోడిని పట్టుకొచ్చిన ఓ సాయిబుని హాఫ్ టికెట్ కొనుక్కొన్న ఓ పద్దెనిమిదేళ్ళ పాపాయిని లగేజ్ చెయ్యకుండా మనవడికిష్టమని ఓ బామ్మగారు తెచ్చుకొచ్చిన నాలు గోంగూర జాడీలనీ, పట్టుకొని డబుల్ ఛార్జి చేసిపారేశాడు. మరో వైపునుంచి స్టార్టవబోతున్న ఓ పాసింజెర్ ట్రెయిన్‌లోని సెకండ్‌క్లాసులో ఎక్కి తలుపు దగ్గర నుంచున్న ఓ కాలేజీ కుర్రాణ్ణి టికెట్టడిగాడు.

ఆ కుర్రాడదేం వినబడనట్లు మరో వైపు చూడసాగాడు

'మిష్టర్! నిన్నే...టికెట్?...'

'టిక్కెట్టుమాతమ్ముడు దగ్గరుంది !'

'మీ తమ్ముడేడీ?'

'అది తెలిస్తే, టికెట్ నా దగ్గరే వుండేదిగా...వాడే పెట్లో ఎక్కాడో ఏమో !'

'టికెట్ మీ దగ్గరలేందే బండి ఎక్కడానికి వీల్లేదు...అయినా అదసలు సెకండ్ క్లాసుదేనా?'

కుర్రాడు ఓ క్షణమాగి పర్సులోంచి ఓ టికెట్టుతీసి అతని కిచ్చాడు.

అది సెకండ్‌క్లాస్ టికెట్. టికెట్ మీద సైన్ చెయ్యబోతుంటే అమోఘరావు దృష్టి దాని తారీఖుమీద పడింది. అది వారంరోజుల క్రితం తారీఖుది.

'ఏయ్ మిష్టర్!...ఈ టికెట్టివాళ్టిది కాదుగా...'

'ఇవాళ్టిదని ఎవడన్నాడూ?...నేనెప్పుడూ సెకండ్ క్లాస్‌లోనే ట్రావెల్ చేస్తానని మీకు తెలియడానికి చూపించాను...'

ఇంజను కూత వేసింది. వెంటనే గార్డు విజిల్ కూడా వినబడింది.

'నువ్విక్కడ దిగాలి! టికెట్ లేందే పోడానికి వీల్లేదు...'

స్టూడెంట్ దిగకుండానే ఎవర్నో చూచి పిలచాడు.

'వరేయ్! తమ్ముడూ! ఈయనకి నా టికెట్ చూబించరా...'

అతనుదగ్గరకువచ్చి టికెట్‌చూబించాడు.

'మరి...మీ టికెట్టేదీ?' తమ్ముణ్ణి అడిగాడు అమోఘం.

బండి కదిలింది. స్టూడెంట్సిద్దరూ బండిలోకి దూకేశారు.

'నాది నా దగ్గరెందుకుంటుంది టి. సి గారూ! మా తమ్ముడు దగ్గరుంటుంది. కావాలంటే మా యింటికి రావోయ్‌- ఎన్ని కావాలంటే అన్ని టికెట్లు చూబిస్తాను...అరె! ... వెళ్ళిపోతావేమోయ్ ... దమ్ముంటే రారాదూ...'

బండి వేగం అందుకొంది.

అమోఘరావు ఏమీచేయలేక చూస్తూండి పోయాడు.

మరో పదినిమిషాలకే మద్రాసు ఎక్స్‌ప్రెస్ ఆగింది ప్లాట్‌ఫారంమీద.

బండి ఆగుతూనే రంగడు బాబాయి దిగేడు పెట్టె బెడ్డింగు తీసుకొని.

'ఏరా! చిట్టి! అయిదేళ్ళయిపోయింది నిన్ను చూసి.. మొన్న సింగినాథం కనబడి చెప్పేడు. నువ్వు రేల్వేలో పెద్దచెకింగ్ ఉద్యోగంలో వున్నావటాని ... ఇక్కడికి టికెట్టు కొనబోతూంటే వాడే కొప్పడ్డాడు.

'అక్కడ చిట్టోడుండగా టికెట్టేంటి? కనీసం నువ్వు కొనబోయినట్లు వింటేనే వారంరోజులు మనను కష్టపెట్టు కుంటాడువాడు. అలాంటి పిచ్చిపను ల్జెయ్యకు అని' అన్నాడు అమోఘరావు దగ్గరకొచ్చి.

ఇదంతా చెప్పేలోపల అమోఘరావు రసీదు వ్రాయడం పూర్తి చేసేడు.

'ఆర్రూపాయల ముప్పావలాకట్టి రసీదు తీసుకోండి ! లేకపోతే పోలీసుల కివ్వాల్సి వస్తుంది...'

రంగడు బాబాయి తెల్లబోయి, సంగ తెల్సుకొని బూతులు తిట్టేయడం మొదలెట్టేడు.

'మీ వంశమే అంతరా! అందరూ దౌర్భాగ్యపు వెధవలు...ఇకనుంచి మా ఇంటి మీద పిచ్చిక కూడా మీ యింటిమీద వ్రాలదు...ఛీ! ' అనేసి కండువా దులిపేసి డబ్బుకట్టి, రసీదు తీసుకొని బయటకు నడిచాడు.

ఆ కోపంతో, అమోఘరావు మళ్ళీ ప్లాట్‌ఫారంమీదకి నడిచి అప్పడే ఫస్టు క్లాసులోంచి దిగుతూన్న తన సుపీరియర్‌ని 'పాస్' చూబించమన్నాడు. కమర్షియల్ ఇనిస్పెక్టర్ నవ్వుతూ 'ఏమిటోయ్ అమోఘం! నాది సెకండ్ క్లాస్ పాసని నీకు తెలుసుకదా?...ఇంక చూసే దేముంది?' అన్నాడు.

'అట్లయితే ఫస్టుక్లాసులో ట్రావెల్ చేసినందుకు ఎక్సెస్ చేస్తున్నాను ... ముప్ఫయిఆర్రూపాయలు కట్టండి!...'

'నిజంగానే అంటున్నావా... నే నెవరో గుర్తుంది కదూ నీకు...?'

'మీరు డబ్బు కడతారా కట్టరా?' ఎదురు ప్రశ్న వేశాడు అమోఘం.

ఆయన 'ఆల్ రైట్' అంటూ డబ్బు కట్టేశాడు.

వారంరోజుల తర్వాత 'మిస్ బిహేవియర్ విత్ పాసింజెర్స్' అన్న కారణంమీద అమోఘరావుని డిస్మిస్ చేశారు. అతను అరుగు మీద కూచునుంటే, కాలేజీకి పోతున్న అతని మరదలు పాపాయి అతని వంక చూసి కిసుక్కున నవ్వింది '...తప్పించుకొన్నావ్ బావా!...' అంటూ తన చేయి చూబించి. ●



# అరవయ్యేళ్ల కింది తెరవెనుక కథ

1910 దాకా కలకత్తా బ్రిటిషు ఇండియా రాజధానిగా ఉండేది. వయ్స్రాయి అక్కడే ఉండేవాడు. దీనినిబట్టి ఎందరో జమీందార్లూ, సంపన్నులూ కూడా కలకత్తాలోనే నివసించేవారు. రాజధానిలో ఉండేవారు కాబట్టి మంచి దర్జాగా బతకాలని ప్రయత్నించేవారు.

ఎంత దర్జా ఉన్నా ఒక్క విషయంలో మాత్రం వయ్స్రాయిని అనుకరించటానికి సాహసించలేకపోయేవారు. అదేమిటంటే, అప్పటి వయ్స్రాయి లార్డ్ కర్జన్ ప్రతి రోజూ సాయంత్రం చక్కగా అలంకరించిన గుర్రపుబండీలో షికారుకి వెళ్ళేవాడు. ఈ బండికి ఏడు గుర్రాలు ఉండేవి. ఇటువంటి వాహనంలో ప్రయాణంచేసే ధైర్యం అక్కడి పెద్దమనుషులెవరికీ ఉండేదికాదు!

అటువంటప్పుడు, 1908 లో ఒక సాయంకాలం ఒక ఏడుగుర్రాలబండీ కలకత్తా వీధుల వెంబడే వెళ్ళడం చూసి జనం ఆశ్చర్యపోయారు. ఆ బండిలో ఒక స్త్రీ వెడుతోంది. మంచి ఠీవిగా, రాణీగారిలాగ కూర్చుని ఉంది ఆవిడ.

ఆమె ఎవరు? ఎవరోకాదు, సుప్రసిద్ధ గాయకి గోహర్ జాన్

ఈ శతాబ్ద ఆరంభంలో సంగీతంలో ఒకరకం విప్లవం బయలుదేరింది. ఈ విప్లవానికి మూలకారణం గ్రామఫోను యంత్రం అంతకిముందు, ఎవరో కొందరు సంపన్నులకి మాత్రమే అందుబాటులోఉన్న సంగీతం వినే అవకాశం సామాన్యులకికూడా కలిగింది.

ఈ సంగీత విప్లవంలో అశేష ప్రజాదరణని అందుకొన్న మధురగాయని గోహర్ జాన్.

ఈ గోహర్ జాన్ మరెందుకు ఇలా వాహనంలో వెడుతోంది ?

ఇలా సతమతమవుతున్న జనానికి మరొక ఆశ్చర్యకరమయిన దృశ్యం కనిపించింది. అదే వీధి వెంబడి లార్డ్ కర్జన్ కోచి బండీ కూడా వెడుతోంది! రెండు బళ్ళు ఒకదాని నొకటి కలుసుకున్నాయి. ఎదురు బండిలో ప్రయాణం చేసేది ఎవరో మహారాణి అనుకుని వయ్స్రాయిగారు గౌరవార్థంగా టోపీ తీసివేసి, తల వంకించి, మళ్ళీ టోపీని ధరించాడు...

తర్వాత తెలిసింది లార్డ్ కర్జన్‌కి ఆ ఆడమనిషి గోహర్ జాన్ అనే గాయకి అని! వెంటనే వయ్స్రాయి కార్యాలయం నుంచి గోహర్ జాన్‌కి ఒక చిన్న మందలింపు వెళ్ళింది.

గోహర్ జాన్ ఈ మందలింపుని లెక్క చెయ్యలేదు. వీలయినప్పుడల్లా తన గుర్రపు బండీ షికారు చేస్తూనే ఉండేది. కలకత్తా జనులకి ఆమె ధైర్యం సంతోషాశ్చర్యాలని కలిగించింది. లార్డ్ కర్జన్‌కి 'నియంత' అనే పేరు ఉండేది. అయితే ఈ నియంతృత్వం రాజకీయాలని దాటి వెళ్ళలేదని త్వరలోనే అందరికీ తెలిసిపోయింది. గోహర్ జాన్ సరదాకి అడ్డుపడలేదు కర్జన్...

ఈ కథని ఈ మధ్యనే మహమ్మద్ ఆలీఖాన్ (ప్రఖ్యాత గాయకుడు) బొంబాయిలో కొందరు శ్రోతలకి చెప్పాడు. ఆయన ఇరవయ్యేళ్ళు గోహర్ జాన్ వద్ద శిష్యరికం చేశాడు...

—వి. ఎస్. సుక్తాంకర్.






# హృదయం చిగిర్చింది

కె. రామలక్ష్మి

### జ రి గి న క థ

రమ బావగారు ఆమెని కాలేజీ లేడీస్ హాస్టలులో చేర్చి వెళ్లిపోతాడు. వార్డెను సరళని పిలిచి రమని పరిచయం చేస్తుంది. సరళ చలాకీపిల్ల. రమతో బాగా స్నేహం ఏర్పరచుకుంటుంది. కొత్తగా వచ్చిన లెక్చరరు రామారావు రమపై మోజు చూపిస్తూ వుంటాడు. రమా, సరళా ఇద్దరూ ఆ విషయాన్ని గ్రహిస్తారు. రమతో రామారావును కలిపి కాలేజీ పిల్లలు అల్లరి చేయడం మొదలెడతారు. రామారావు సరళని రమ దగ్గరికి రాయబార మంపుతాడు. ...కి నుస్తీ ...సిందని విన్న రమ చూసిరావ ...నికి వెళ్తుంది బావతో రామారావు సంగతి చెప్పి ... ఒప్పిస్తుంది. తనకు భర్త పోయిన విష ... ఒక పాప వున్న ... ...న్ని సరళకి రాస్తుంది ...

## 4

ఆ రోజా సాయంత్రం అయిదు నుంచి ... రామారావు ...పార్యగ్రంథాలు ...గి సరళకి బోధిస్తున్నాడు సరళతో పాటు రమకూడా వస్తూ ...డడం అతనిలో ఉత్సాహాన్ని రెట్టించింది. పరీక్షలలో ...లు రావడానికి కావలసిన ధోరణిలో ...త్వరగా పాఠాలు చెప్తున్నాడు.

'మేష్టారూ, మీ రా రోజు రాయబారా ...ను గురించి బాగా చెప్పారు' అందొకరోజు సరళ.

'నైషధం నాకు చాలా యిష్టమైన గ్రంథం సరళా, ఏం రమా, నీకు తెలుగు సాహిత్యంలో అభిరుచి ఉందా?' తల వంచుకు కూర్చున్న రమని అడిగాడు.

'తెలుగు సాహిత్యం ఏం ఖర్మ! కవిత్వం కూడా చెప్తుంది మేష్టారూ' అని వేళా కోళం చేసింది సరళ.

రమ ముఖం సిగ్గుతో కందిపోయింది. లేచి లోపలికి వెళ్లిపోబోయింది. సరళ రమ చేయి అందుకుంటూ,

'కూర్చో రమా, ఉట్టినే వేళాకోళం చేస్తే అలా ఉడుక్కుంటా వేమిటి?' అని కూర్చోపెట్టింది.

ఆరోజు మొదలు సరళ ఏదో వంకని పాఠం మధ్యలో లేచి ఏ పుస్తకం తేడానికో పెన్ను తేడానికో అంటూ రూములోకి వెళ్లి వస్తుంది. అక్కడ అనవసరంగా జాప్యం చేస్తుంది. ఇదంతా రమ గ్రహించకపోలేదు. కాని ఎటూ చెప్పలేనిస్థితిలో ఉండిపోయింది.

సరళ రూములోకి వెళ్లిం దా రోజు—ప్రోజుపుస్తకం తెస్తానంటూ. రమతో ఏకాంతంగా మాట్లాడడానికి ఇలా ఎన్నో అవకాశాలు వచ్చి వెళ్లిపోయాయి. రామారావు మాట్లాడలేకపోయాడు. ఈరోజెలాగేనా తన మనసులోని మాట రమకి చెప్పాలని నిశ్చయించుకున్నాడు,

'రమా. నాకేసి చూడ్డం అంటే నీకు భయమా?' నవ్వుతూ అడిగాడు.

'భయం ఎందుకు మేష్టారూ' అంది నెమ్మదిగానే.

'మరి—లేకపోతే అసహ్యమా?' రెట్టించాడు రామారావు.

'ఏదీ కాదు మేష్టారూ, మీకు చెప్పినా అర్థంకాదు' అంది తన చేతివేళ్ల కొనలు తీవ్రంగా పరీక్షచేసుకుంటూ.

'అంత మూర్ఖుడి కింద జమకట్టా వన్నమాట నన్ను' నవ్వుతూ అన్నాడు రామారావు.

'లేదు మేష్టారూ, క్షమించండి, మీరలా అనుకుంటారనుకోలేదు నేను...' ఎలా మొదలుపెట్టి చెప్పాలో తెలియక ఆగిపోయింది రమ.

'చెప్పు రమా, మనిద్దరిమధ్యా ఇంత దూరం దేనికి చెప్పు? సరళ నా మనస్సు నీకు చెప్పనే లేదా?' ఆత్రంగా అడిగాడు రామారావు.

'చెప్పింది మేష్టారూ కాని..'

'చెప్పు రమా నీ కిష్టంలేదా? నాకు [illegible]కు [illegible] రమా; నీలాంటి సహృదయంకల స్త్రీ సహచారిణిగా దొరికితే చాలు—జీవితం తేలికగా సాగిపోనీయ కలనని ఎన్నాళ్లనుంచో కలలుకన్నాను. నువ్వు యిప్పుడు కనిపించి నాకు అందనంటున్నావు.'

'అలా అని కాదు మేష్టారూ, మీకు తెలియదు నా సంగతి, నేనంత సౌభాగ్యానికి నోచుకోలేదు మేష్టారూ' వస్తూన్న దుఃఖాన్ని ఆపుకొంటూ ఎలాగో అనేసింది రమ.

'ఏం మీ అమ్మగారు ఒప్పుకోరని భయమా?'

'అది కాదు..'

'నీకే ఇష్టంలేదా?'

'మేష్టారూ,' బాధగా అంది రమ. ఇంతలోకే పుస్తకం పట్టుకునివచ్చింది సరళ.

'ఈ రమ పుస్తకాలన్నీ తల్లక్రిందులు చేసేస్తూ ఉంటుంది మేష్టారూ' ఆలస్యానికి కారణం వివరిస్తున్నట్టు అంది సరళ.

'ఫరవాలేదు సరళా, ఈరోజు నీ స్నేహితురాలు కొంచెం గొంతు విప్పి మాట్లాడింది. మంచుబొమ్మ కొంచెం కరుగుతూంది!' నవ్వుతూ అన్నాడేగాని రామారావు చాలా గంభీరంగా ఉన్నాడని గ్రహించింది సరళ.

మేష్టారు వెళ్లిపోగానే రమని నిలవేసింది.

'ఎందుకు మేష్టారంత త్వరగా పాఠం ముగించి వెళ్లిపోయారు?'

'నాకేం తెలియదు సరళా, నన్ను వేధించకు' బాధగా అంది రమ.

'నేను నిన్ను వేధిస్తున్నానా? నువ్వం దరినీ వేధిస్తూ, బలేదానివే' రమ వెనకనే తమ రూములోకి నడుస్తూ ఏడిపించింది సరళ.

సమాధానం చెప్పకుండానే గుడ్ల నీరు కుక్కుకుంది.

తన పక్కనే రమని కూర్చోపెట్టుకుంటూ, అసలీమెగారి ఉద్దేశ్యం ఏమిటో తెలుసుకోవాలి అనుకుంది సరళ.

'చూడు రమా, ఇలా ఇప్పుడు చదివి, పరీక్షలు ప్యాసై ఏదైనా ఉద్యోగంలో ప్రవేశించి స్వేచ్ఛగా హాయిగా బ్రతకాలని నీ ఉద్దేశ్యం. కాని మనం ప్లానువేసినట్టు అన్నీజరగవు ఈ ప్రపంచంలో. నువ్వెందు

కిప్పుడిలా మళ్ళీ మొదటికొచ్చి చదవాలసి వచ్చిందో ఆలోచిస్తే ఈ సంగతి ఎప్పుడో నీకు అర్థం అయేది అవునా ?'

'అయితే ఇప్పుడు నన్నేం చెయ్య మంటావు? చదువు మానేసి వెళ్ళిపోనా?' అడిగింది రమ.

'అదీ అలా కొంచెం మనిషిలా ప్రవ ర్తిస్తూ ఉండు. మరీ జీవంలేని జవాబులు నా కిష్టం ఉండదు' అంది సరళ నవ్వుతూ.

'మధ్యలో చదువెందుకు మానేయడం? మేష్టారిని పెళ్ళిచేసుకుని తరవాత కావ లిస్తే మానేయమ'ని అంది సరళ.

నిర్ఘాంతపోయి చూసింది రమ.

'సరళా, జీవితం ఎంత తేలిగ్గా తీసు కుంటున్నావు నువ్వు. నువ్వన్న పని అంత సులభంగా పరిష్కారం అయేదనా నీ ఉద్దేశ్యం ? ఈ ప్రపంచంలో మనుషుల తత్వాలు అతి సన్నిహితంగా బ్రతుకుతేనే అర్థం కావే. అలా పైపైగా తెలిసి పోయాయని మోసపోకు' అంది రమ.

'అంటే నీ ఉద్దేశ్యం నువ్వు వితంతు వనీ, ఓ పిల్ల తల్లివనీ తెలిసిననాడు మేష్టారి ప్రేమ ఆవిరిలాగా హరించుకు పోతుందనా ?'

'అంతదాకా అక్కరలేదు రమా, నే వితంతువని తెలియగానే మేష్టారు వెనకడుగు వేయక తప్పదు సంఘంలో ముందడుగు వేస్తామన్నంతగా వేశాక ఉండదా ఆనందం సరళా, నీవన్నీ గాలిమేడలు, నీ ఊహ లెప్పుడూ సాలీడులాగా పంచవర్ణాల కలలు అల్లుతూ ఉంటాయి. కాలూని నేలలో నిలవవు.' నిట్టూర్చింది రమ.

'ఇంత తలబద్దలు కొట్టుకోవటందేనికి, రేపు నేను చెప్పేస్తాను.' అంది సరళ.

'వద్దువద్దు. ఆసమయం అదేవస్తుంది. అప్పుడే తెలుసుకుని ఆయన నిర్ణయం తేల్చుకోనీ' అంది రమ.

'మరి నీ నిర్ణయం?' కుతూహలంగా అడిగింది సరళ.

'నా నిర్ణయం నీకు తెలియకుండానే ఇంతదాకా దౌత్యం నడిపావా ?'

అమాంతం రమని కౌగిలించుకుంది సరళ.

'అలా ఉండాలి. అంతే కాని భగవంతు డొక దెబ్బతీశాడుకదా అని మనం దానికి రెండు [illegible] జీవితం కాలిపోయేటట్టు చేసు కోవడం నేను సహించలేను రమా, అందు లోను ముఖ్యంగా నీలాంటి ఆర్ద్రహృద యులు—అలా చెయ్యనేకూడదు. వీరు ఎన లేని అనురాగాన్ని, త్యాగాన్ని అందివ్వకలరు. పంచుకోకలరు. అని తగిన వ్యక్తికి ఇవ్వ కుండా దూరంచేయడం ద్రోహం కదూ?' రమ ముఖంలోకి చూస్తూ అడిగింది.

రమ ముఖం నిశ్చలంగా ఉంది. ఆమె మనస్సు ఓ నిర్ణయానికి ఎప్పుడోవచ్చింది. నిజంగా కొత్త చిగుళ్ళు తన జీవితం తొడి గితే, చేతులారా తుంచదలచుకోలేదు రమ అందుకే ప్రాణస్నేహితురాలికి కళ్ళతోనే తన నిర్ణయం చెప్ప కలిగింది.

*　　*　　*

సరళకి చాలా ఉత్సాహంగా ఉంది. పరీ క్షలు సాగుతున్నాయి. రమకి రేపు ఆఖరి పరీక్ష అనగా సుందరం హడావిడిగా ఊరు నుంచివచ్చాడు. డాక్టరేవో మందులు కొనమన్నాడని తక్షణం బయలుదేరి వచ్చాడు.

'పాపకి చాలా సుస్తీచేసింది రమా, నువ్వూ నాతో ఈరోజే బయలుదేరు' అని రమని వెంటబెట్టుకుని ఆఖరి బస్సుకి వెళ్ళిపోయాడు. ఎదురు చూడని యీ పరి ణామానికి రమా, సరళాకూడా దిగ్భ్రమ చెందారు.

'ఏం ఫరవాలేదు. నువ్వెళ్ళేసరికి హాయిగా ఆడుకుంటూ ఉంటుంది' అంటూ ధైర్యం చెప్పి పంపింది సరళ.



# హృదయం చిగిర్చింది

బస్సులో కూర్చుందన్నమాటేగాని రమ మనసు మనస్సులో లేదు. పసిదానిచుట్టూ తిరుగుతూంది. బస్సు ఎంతకి కదలడం లేదేం! అనిపించింది. మనస్సులో తొందర ఎక్కువ అయినకొద్దీ బస్సు నెమ్మదిగా నడుస్తుందా అనిపించింది.

ఊరు చేరినా ఇల్లు రావడానికే ఆలస్యం అయిందా అన్నట్లు విలవిల్లాడిపోయింది రమ. ఇల్లు రాగానే గబగబ ఆత్రంగా లోపలికి పరుగెత్తింది జానకి ఒళ్లో పడుకుని పెద్దదానిలాగా 'అమ్మా' అని మూలుగుతోంది పాప. దాని బాధ చూసి, జ్వరం తీవ్రత చూసి హడలిపోయింది.

కాని డాక్టరు మరేం భయం లేదన్న ధైర్యం చెప్పడంతో కుదుటపడి పాప ఉపచారాలకి పూనుకుంది.

రమ ఆత్రుతవల్లనో, డాక్టర్ల మందువల్లనో త్వరలోనే జ్వరం తిరుగుముఖం పట్టింది. జ్వరం నార్మల్‌కి వచ్చిన మరుక్షణంనుంచీ లేచి కూర్చుంది పాప. కాని రమ మటుకు తన నావరించిన పిరికితనంనుంచి కోలుకోలేకపోయింది. అదే పిల్లలకీ పెద్దలకీ తేడా. జ్వరం తగ్గగానే వాళ్లు హాయిగా లేచి తిరుగుతారు. రోగం తగ్గినా 'అమ్మో ఎంత జబ్బు చేసిందో' అన్న బెంగమటుకు పెద్దవాళ్లని వదలదు. అదే స్థితిలో ఉంది రమ. అయితే .. అందుకే పసిదానికి పత్యంపెట్టినా, అది బాగా నయం అయి తిరుగుతున్నా వదిలి వెళ్లలేకపోయింది. దానికి కావలసినవన్నీ స్వంతంగా చేస్తుంటే ఏదో తృప్తితో మనస్సు తేలికఅయింది రమకి

'ఏమే పరీక్షలున్నాయిగా! వెళ్లవా?' పాపకి తల దువ్వుతూ కూర్చున్న రమని అడిగారు రమ తల్లి.

'ఇంక రెండే పరీక్షలున్నాయమ్మా, వెళ్లి ప్రయోజనంలేదు. తరవాత పది రోజులు సెలవులుంటాయి' అంది రమ.

'అప్పుడే కిందటిసారి నువ్వు వచ్చినప్పుడే అడగాలనీ...!

'అడుగమ్మా, ఏమిటి?' యాధాలాపంగా అంది రమ.

'నువ్వూ బావా మాట్లాడుకుంటుంటే విన్నాను. నే విన్నది నిజమేనా?'

'నువ్వేం విన్నావో నాకేం తెలుస్తుందమ్మా, అదేమిటో చెప్తే చెప్తాను' పరదాగా నవ్వుతూ అంది రమ.

కాల్చిన అప్పడం చేతితో పట్టుకుని పాప కివ్వాలని జానకి వచ్చిం దక్కడికి.

మాటలజాడ విని సిగరెట్టు పెట్టె జేబులోంచి తీసుకుంటూ సుందరం కూడా వచ్చాడటు. రమ పెదవులమీద నవ్వు ఇంకా అలాగే ఉంది.

'నువ్వు ఎవర్నో ప్రేమిస్తున్నావా ?' ఆ అడగడం కంచుతో కొట్టినట్టుంది.

రమ అదిరిపడింది.

సుందరం బావ సిగరెట్టుపెట్టె కింద పడింది. పాప చేతిలో అప్పడంపెట్టి చంకని వేసుకుని బయిటికి నడిచింది జానకి.

'ఏమిటత్తయ్యా నువ్వడిగేది?' గదమాయించినట్టు అన్నాడు సుందరం బావ.

సంభాషణ ఈ విషయంపై రావడం ఆతనికి ఒకందుకు ఆనందంగా ఉంది. అత్తయ్యకి ఎలా తెలియచెప్పాలా అని సంకటపడుతున్నాడు కొన్నాళ్లుగా. ఆబాధ లేకుండా ఇప్పుడామె ఉద్దేశ్యం ఏమిటో తెలిసిపోతుంది.

'ఏమిటమ్మా నువ్వడిగేది?' రమ మాట నూతిలోంచి వస్తున్నట్టుగా ఉంది.

'అదే నువ్వు ఎవరినో ప్రేమిస్తున్నావా?' రెట్టించింది రమ తల్లి.

'అవునత్తయ్యా, రమ నాతో చెప్పింది' నెమ్మదిగా అన్నాడు సుందరం.

'నీకు చెప్పినప్పుడు విన్నా దాని సంగతే నేనూ ఇప్పుడు అడుగుతున్నాను సుందరం' అన్నారామె.

రమ కళ్లప్పగించి చూస్తూ ఊరుకుందే గాని బదులు చెప్పలేదు.

'రోజు లెంతగా మారిపోతున్నాయో చూస్తున్నావుగా అత్తయ్య. రమ ఎన్నాళ్లిలా ప్రపంచంలో ఒంటరిగా బ్రతుకుతుంది చెప్పు ? ఎవరినైనా ఇష్టపడి రెండోపెళ్లి చేసుకుంటే తప్పేముంది ?' గడపమీద సద్దుకు కూర్చుంటూ అడిగాడు సుందరం.

'ఈ ప్రపంచంలో ఇంక తప్పేమిటి సుందరం, అంతా ఒప్పే' అది హేళనగా అన్నారో, నిజంగా అన్నారో తెలియని స్వరంలో అన్నారు రమ తల్లి.

'అదికాదత్తయ్యా, నువ్వే ఆలోచించి చూడు. ఇప్పుడే చదువు సంధ్యలు పూర్తిచేసి ఏదో ఉద్యోగం చూసుకుని అది చేసుకుంటూ కాలం గడపాలంటే-రమ ఎంత

కాలం సాగించాలో చూడు.' పాపకో భవిష్యత్తు ఏర్పడవద్దూ? రమ ఏం అనుభవించిందని ఇంత నిస్పృహగా బ్రతికేయడానికి? ఏం అనుభవించిందని ఆ సంతృప్తితో నిశ్చింతగా బ్రతకడానికి?' ఆవేశంగా అడిగాడు సుందరం.

'అమ్మా.. నీయిష్టం చెప్పమ్మా. చదువు మానేసి ఇక్కడే ఉండిపోమన్నా ఉండిపోతానమ్మా. నువ్వు కోపగించుకోకుండా చెప్పు' తల్లి ఒళ్లో తల దాచుకుని వెక్కి వెక్కి ఏడ్వసాగింది రమ.

రమ తల్లి కూడా కంట తడిపెట్టారు. ఆమెకి ఎటూ చెప్పాలన్నా ఏం చెప్పాలో తెలియడంలేదు. ఆమెకి పడుతున్న మానసికమైన ఆరాటానికి అర్థం చెప్పేవారు కూడా లేరు.

రమ భర్త పోయి తిరిగి యింట అడుగు పెట్టిననాడే అనుకున్నారు. 'వారిమాట విని పిల్లని చదివించి ఉంటే' అని. కాని ఏం లాభం? గడచిన విషయాలని మార్చలేం కదా?

రమకి పాప పుట్టినప్పుడు అనిపించింది 'ఈ పాపకేం దారి?' అని.

ఆవిడ మారకూడదనుకుంటూనే మారుతూ వస్తున్నారు. కాని అదెవరూ గమనించడంలేదు. భర్తని దూరంచేసుకున్నావే అని ఆయన పోయిన క్షణంనుంచీ ఆమె బాధపడుతూనే ఉన్నారు. కూతురి విూద భగవంతుడు దెబ్బతీయడంతో ఆమెలోని కార్చిచ్చు రగిలిందేగాని తగ్గలేదు. నివురుకప్పిన నిప్పులా కుములుతుందామె హృదయం. వడిలో పడుకుని ఏడుస్తున్న కూతురికి ధైర్యం చెప్తున్నట్టు తల రాస్తూ ఊరుకున్నారామె.

* * *

రమ పరీక్షలు ఆఖరు రెండూ రాయకపోవడం గ్రహించాడు రామారావు. మళ్లీ ఏమొచ్చింది? అనుకుని సరళని ఓ సాయంత్రం అడిగాడు. 'రమ పరీక్షలు వ్రాయడంలేదేం?' అని.

'పాపకి చాలాసుస్తీ చేసిందిట మేష్టారూ ఊరుకి వెళ్లిపోయింది.' అనేసి నాలిక్కరుచుకుంది సరళ. ఇక అంతా బయటికి రాక తప్పదు కాబోలు అనుకుంది. 'ఎవరి పాపకి?' యధాలాపంగా అడిగాడు రామారావు.

'రమ పాపే మేష్టారూ' సూటిగా అంది సరళ.

'రమ పాపా?' రెట్టించి అడిగాడు రామారావు.

'అవును మేష్టారూ, రమకి ఓ పాప ఉంది. రెండు సంవత్సరాలు దాటి ఉంటాయి అంది సరళ.'

తను వింటున్నదేమిటో అర్థం కాలేదు రామారావుకి.

'ఏమిటి సరళా నువ్వనేది? రమకి పెళ్లయిందా?'

'అవును మేష్టారూ' సరళ నెమ్మదిగా అంది.

'నా కెందుకు చెప్పలేదు? మీ ఇద్దరూ కలిసి నన్ను ఆడించాలనుకున్నారా?' నీరసంగా అడిగాడు రామారావు.

'ఛఛ, లేదు మేష్టారూ, మీకు చెప్పే అవకాశంకోసమే చూస్తున్నాను. పాప కడుపులో ఉండగా రమ భర్త పోయాడు. పాపకి రెండేళ్లు వస్తున్నాయి. ఇలా ఎన్నాళ్లని కాలేజీలో చేరింది రమ. మీ రా విషయాలన్నీ చెప్పే అవకాశం ఎప్పుడూ రానివ్వలేదు మేష్టారూ, మిమ్మల్ని ఆట పట్టించాలనేటంత అల్పబుద్ధి నాకులేదు రమ కిలాంటివి ఊహకు కూడా అందవు. మిమ్మల్ని మనసారా ప్రేమించి ఆ సంగతి చెప్పలేని అభాగ్యురాలు రమ, క్షమించండి మేష్టారూ' అంది సరళ.

కాని ఎదుట మేష్టారుంటేగా? సరళ మాట పూర్తిగా వినకుండానే చరచర వెళ్లిపోయాడు రామారావు.

ఆ వెళ్లిపోవడం—రెండురోజులు గడిచినా తిరిగి సరళ కంటపడలేదు.

ఆ రెండురోజులలో రెండు యుగాల వ్యథ అనుభవించాడు రామారావు. రమ వితంతువా? బిడ్డతల్లా? అన్న ప్రశ్నలు సమాధానాలు అతన్ని వెన్నాడి పిచ్చివాణ్ని చేశాయి. ఇప్పుడేం చేయాలి? ఇప్పుడేం చేయాలి? అని లక్షసార్లైనా తనని తాను ప్రశ్నించుకున్నాడు. అతని హృదయం రమపట్ల ద్రవీభూతమైందేగాని కరడు కట్టుకోలేకపోయింది. రమ దేం తప్పుంది? ఆమె నన్నేం ప్రేమించమని శాసించిందా? అనుకున్నాడు. రెండురోజులు సతమతమైన అతని మనస్సు ఒక దారి పట్టింది. ఒక నిర్ణయం చేసుకుంది.

ఆ రోజు ఆదివారం. సోమవారం ప్రాక్టికల్ కోసం తీవ్రంగా చదువుకుంటూంది సరళ. బోయి వచ్చి ఎవరో వచ్చారని చీటీ తెచ్చాడు. ఆదరాబాదరాగా విజిటర్సు రూము చేరింది సరళ.

(ఇంకా వుంది)





# ధర్మపథం




బులుసు వేంకటరమణయ్య

త్రిలోకసంచారి అయిన నారదమహా మునికి ఒకప్పుడు ఒక ధర్మసందేహం కలిగింది. యావత్సృష్టిలోనూ ఎవరు గొప్ప అని ఏమంటే అతడు యే లోకంలోకి వెళ్లినా ఆ లోకనాయకుడే గొప్పవాడని అతనికి తోచేది. త్రిమూర్తులలో కూడా ఎవ్వరు అధికులా అనే జిజ్ఞాసకూడా అతనికి కలగకపోలేదు.

తన సంశయాన్ని నివర్తించడానికి నారాయణుడు తప్ప మరొకరికి సామర్థ్యం లేదని నారదుడికి తెలుసును. అందువల్ల అతని మూలంగా తన సందేహాన్ని తీర్చుకోవాలని విష్ణువుదగ్గరికి వెళ్లాడు.

నారదుణ్ణి చూడగానే మహావిష్ణువు సంగతి సంతటినీ గ్రహించాడు. నారదుడు ఏదో చెప్పడానికి నోరు కదుపుతూ ఉన్నాడు. అప్పుడా దేవదేవుడు 'నారదా! నీవు ఎందుకు వచ్చినదీ నాకు తెలుసును. నేను చెప్పేదంతా విను. దానివల్ల నీ సందేహానికి సమాధానం – ఇతరులు చెప్పనక్కరలేకుండా నీకే తెలుస్తుంది' అంటూ ఇలా ఉపక్రమించాడు.

'నారదా! సమస్త లోకాల్లోనూ భూలోకమే స్థావరజంగమాలతో కలకలలాడుతూ కోటానకోట్ల జనంతో నిండి విస్తృతంగా ఉంటున్నది గదా! దీనిని అంతా ఒప్పుకుంటారు. ఆ భూమండలం దేనిలో ఒక మారుమూలలో అణగివుందో తెలుసుమగదా! మహాసముద్రంలో కాదూ? ఆ మహాసముద్రాన్ని ఒక్క పుడిసిటిలో పట్టి తాగిన మహాత్ముడు అగస్త్య మహాముని కదూ! అతడు మహాసముద్రంకంటె గొప్పవాడు కాడ? ఇక ఆ మహామునిని మించినది మహాకాశం కదూ! ఏమంటే — అంతగొప్ప అగస్త్యుడూ ఒక నక్షత్రమయి, ఆ మహాకాశంలో కోట్లకొలదిగా వుండే నక్షత్రాలలో ఒక నక్షత్రంగా వున్నాడు కదా! దీన్ని బట్టి మహాకాశం మహా విశాలమైనదనీ గొప్పదనీ తెలుస్తూనే ఉన్నది. అయితేనేం? దానికన్నా గొప్పవాడు లేడా? ఉన్నాడు. బలిచక్రవర్తిని పాతాళానికి అణచి వేసిన వామనమూర్తి ఒక్క అడుగుతో దాన్ని ఆక్రమించాడు!'

ఇలా అంటూవుండగా నారదుడు అడ్డు వచ్చి 'చాలును. ఓ దేవదేవా! నీ గొప్పతనాన్ని గ్రహించలేని నా అపరాధాన్ని క్షమించు' అని అన్నాడు.

[మహావిష్ణువు నవ్వుతూ 'నా గొప్పతనాన్ని చాటడానికి ఇంకా పురాణం యాకరువు పెట్టలేదయ్యా! నా కంటే గొప్పవాడొకడున్నాడు... పూర్తిగా వినకుండా ఎందుకు తొందరపడతావు?' అన్నాడు.

నార — మీ కంటే గొప్పవాడా?

మహా — అవును. నా కన్ననూ గొప్పవాడున్నాడు. నా భక్తుడి హృదయంలో నేను ఒక మూల ఇమిడి వున్నాను. అతడు ఎల్లప్పుడూ నన్ను తన హృదయంలో వుంచుకుని ధ్యానం చేస్తూ ఉంటాడు. అతడు నాకంటె గొప్పవాడు అవునంటావా? కాదంటావా?

నారదుని ఆశ్చర్యానికి అంతం లేకపోయింది.

అతడు మరియేమీ చెప్పలేక పోయాడు.

భగవంతుడు భక్తులనే తన కంటే కూడా అధికంగా చూచుకుంటాడు. వాళ్లకు వచ్చే కష్టాలను తాను అనుభవించి భక్తులకు ఎంతో సంతోషాన్నీ, సంతృప్తినీ కలిగిస్తాడు. ●






# నీడవెనుక నిజం

వి. సత్యనారాయణ

ఇంకా పూర్తిగా తెల్లవారలేదు చీకట్లు అప్పుడే విడిపోతున్నాయ్. ఇంటి ముందు ఏదో రిక్షా ఆగినచప్పుడైంది. రుక్మిణివచ్చి 'ఎవరో చుట్టాలొస్తున్నారు మనింటికి' అంది.

తను లేచి బయటకెళ్ళాడు రిక్షాలోంచి దిగుతున్న పద్మను, పద్మ భర్త రాజారావునుచూసి ఆశ్చర్యపోయాడు.

'మధుసూధనరావుగారు మీరేకదూ'

'అవున'న్నట్టు తల ఊపాడు తను.

అయితే నేను పొరబడలేదన్నమాట' అన్నాడతను నవ్వుతూ. తనుకూడ ముఖంలోకి నవ్వు తెచ్చిపెట్టుకున్నాడు. రుక్మిణి రిక్షావాడిచేత సామానులు లోపల పెట్టిస్తోంది.

'మీ ఇల్లు ఒక పెద్ద భవంతి అయి

[illegible] పద్మా పోవా. [illegible] మీరు కనుపించేవరకూ రిక్షాలోంచి కాలు క్రింద పెట్టలేదు.'

'పిచ్చి పద్మ'

రుక్మిణి కాఫీకోసం లోనికి వెళ్ళింది.

అతను అన్నాడు: 'దాని వ్యాధి వివరాలేమిటో నా కంతగా తెలియదు. ఈ ఊళ్ళో హాస్పిటళ్ళూ డాక్టర్లూ నాకు కొత్త. దాని వ్యాధి హాస్పిటళ్ళు డాక్టర్లు ఇక అన్నీ మీవే. డబ్బు కావలిస్తే దాని పెట్లోనే వుంది. పద్మను మీకు అప్పగించి బరువు దించుకుంటున్నాను...అప్పుడప్పుడు వచ్చి కనుపిస్తూవుంటాను. ఇక నాకు శలవా మరి...'

తను మాట్లాడలేదు. అతను వెళ్ళిపోయాడు. అర్ధాంగి, తన శరీరంలో శరీరం, ప్రాణంలో ప్రాణమైన భార్య ప్రాణాపాయస్థితిలో వున్నప్పుడు పరులమీద బాధ్యతను మోపి వెళ్ళిపోయే ఆ మనిషిని ఏ విధంగా అర్థం చేసుకోవాలో తనకు తెలియటంలేదు.

అతను వెళ్ళిపోతూంటే ఎక్కడికీ అని నేను అడగలేదు, అతను చెప్పలేదు పద్మ భోరున ఏడుస్తుందనుకున్నాడు కాని పద్మ నవ్వింది. లోపలకు వెళ్ళిన రుక్మిణి మూడు కప్పుల్లో కాఫీ పట్టుకొచ్చింది ఆ మూడో కప్పుమనిషి ఏమయ్యాడని అయోమయంగా ముఖం పెట్టింది

'ఆయన వెళ్ళిపోయారులే అక్కా. ఆయన కాఫీ త్రాగకుండా వెళ్ళిపోయారని నువ్వేం బాధపడనక్కర్లేదు. ఈ ఊళ్ళో వున్న హోటళ్ళన్నీ ఇక ఆయనవే' అంది పద్మ.

పద్మకు స్నానాలగది చూపించి అడిగింది. 'ఈ అమ్మాయి మీ నాగభూషణం మావయ్యగారి అమ్మాయి కదూ!' అని.

వాళ్ళ చుట్టాల్లో మధుసూధనానికి తెలియనివాళ్ళు కూడ పద్మకు తెలుసు. నాగభూషణం అనే ఆయన మధుసూధనానికి సొంత మేనమామ ఏమీకాదు. వరసకు మావయ్య అంతే.

ఆఫీసుకు శలవు పెట్టివచ్చి పద్మను కె. జి. హెచ్‌కి తీసుకు వెళ్ళాడు. ఆవేళ డ్యూటీలో వున్న సర్జన్ పద్మను క్షుణ్ణంగా పరిశీలించి కేస్ అంత హోప్‌ఫుల్ కాదని పెదవి విరిచాడు.

పద్మకు ఏం సమాధానం చెప్పాలో తనకు అర్థం కాలేదు. అబద్ధాలు చెప్పి పద్మను నమ్మించటం తనకు చేతకాదు. ఇంత ఘోరమైన పరిస్థితుల్లో పద్మకు బ్రతుకుకంటే చావే శాంతిని ప్రసాదిస్తుందేమో ననిపించింది. ఆ పరిస్థితుల్లో అసత్యాలతో పద్మను నమ్మించటం అవి లేకపోతుందేమో.

'కేస్ అంత హోప్‌ఫుల్ కాదన్నాడు పద్మా?' తన సమాధానం విని పద్మ నవ్వింది. 'మా బావ ఎప్పుడవా అబద్ధాలు చెప్పడు'

స్పెషల్ వార్డులో చేరిపించి, చదువుకోవటానికి ఏవో పుస్తకాలు తెచ్చి సాయంత్రం నీకు తోడుగా రుక్మిణిని పంపుతాను, ఇక నేను వెళతాను పద్మా' అన్నాడు తను.

'నాకు ఒంటరిగా వుండుకోవటం అలవాటే బావా! మళ్ళీ అక్కయ్యను కూడ ఈ నరకంలోకి ఈడ్వటం ఎందుకు? పట్టి మనిషి కూడ కాదు.'

'నీకు తెలియదు పద్మా, జబ్బుమనిషివి

'నేను ఏ క్షణంలోనైనా చచ్చిపోతానేమో, నీకాభయం ఏమీ అక్కర్లేదు. నా ప్రాణం అంత తేలిగ్గా పోదు' అంది.

తను ఏం సమాధానం చెప్పకుండా వరండాలోకి వచ్చినిలబడ్డాడు.'

'నా మాటలకు బాధపడుతున్నావా, నా విషయంలో అలాంటివి వదిలేసుకోవాలి. ఇక ఇంటికి వెళ్ళు. రుక్మిణి నీ కోసం ఎదురు చూస్తూవుంటుంది.'

తను ఇంట్లో అడుగు పెట్టేసరికి కేరియర్ పట్టుకుని రుక్మిణి సిద్ధంగా వుంది.

'ఎక్కడికే ?'

'అక్కడికే'

'సరి'

రుక్మిణి కేరియర్ పట్టుకువెళ్ళింది. ఆ రాత్రి తను ఒంటరిగా మిగిలిపోయాడు. రుక్మిణి తన జీవితంలో ప్రవేశించిన తరువాత ఒంటరిగా గడిపిన రాత్రులు చాల తక్కువ. నిద్రపట్టక మనసు పద్మకు సంభవించిన సంఘటనల చుట్టూ తిరగ సాగింది.

* * *

ఎక్కాలురాని పద్మ మధు అనే ఏడేళ్ల మింగి ముఖం పిల్లాడిచేత రోజూ దెబ్బలు తినేది ఆ పిల్లాడు పద్మను దిబ్బ ముఖం పిల్లా అని పిలిచేవాడు.

ఆ మింగిముఖం పిల్లాడిదీ, ఆ దిబ్బ ముఖం పద్మదీ ప్రక్కప్రక్క ఇళ్ళే. ఇంటికెళితే వరసయినవాళ్లంతా మొగుడూ పెళ్ళాలు అని పిలిచేవాళ్ళు. వీళ్ళ ఇద్దరూ నిత్యం దెబ్బలాడుకోవటానికి అదో ముఖ్యమైన కారణం.

ఒక సంవత్సరం కృష్ణాష్టమికి అనుకుంటాను వీళ్లిద్దరూ రాధాకృష్ణులు వేషం కడితే అంత ముక్కుమీద వేలేసుకున్నారు వీళ్ళ దుంపతెగ అచ్చం మొగుడూ పెళ్ళాల్లాగా వేషం కట్టేరు. ఎవరు చెప్పారు వీళ్ళకివన్నీ అన్నారు.

దాంతో వాళ్లిద్దరు ఇంటా బయట మొగుడూ పెళ్ళాలయ్యారు. మీ గోషేం పడలేం అన్నట్టు ఆ ఏడాదే అయిదో క్లాసు అయిపోగానే మధుసూధనం హైస్కూలు కెళ్ళిపోయాడు. పద్మ సరాసరి వంటింట్లో కెళ్ళిపోయింది.



# రోస్టు అయిన కాఫీ గింజలు



# వెదజల్లే వాసనను

ప్రతి డబ్బాలో నింపబడిన

## బ్రూక్ బాండ్

# బాన్

## ఇన్‌స్టెంట్ కాఫీ




"బాన్ — అసలు కాఫీ సువాసన పొందేందుకు తక్షణమార్గం!"



(34A/2 TEL

(బ్రూక్ బాండ్ ఇండియా లిమిటెడ్ వారిచే [illegible] తయారు చేయబడినది)

# నీడ వెనుక నిజం

హైస్కూలు చదువుకు పట్నం వెళ్ళిన మధుసూదనం ఫిఫ్తుఫారం చదువుతూ ఒకసారి వాళ్ళూరొచ్చాడు. 'పద్మకు పెళ్ళి రేపు' అంది వాళ్ళ అమ్మ.

'ఛా! అప్పుడే పద్మకు పెళ్ళేమిటి?' అన్నాడు మధుసూదనం.

'ఛా! ఏమిటి నీ ముఖం' అంది వాళ్ళమ్మ.

'నువ్వయితే ఇంకా పొట్టి లాగులు తొడుగుతున్నావు. వెళ్ళి పద్మను చూడు. ఇంకా చిన్నపిల్లే ననుకుంటున్నావేమో' అంది వాళ్ళ వొదిన.

ఆ వేళ సాయంత్రంవెళ్ళి పద్మను చూసి ఆశ్చర్యపోయాడు. 'ఛా ఇది పద్మకాదు' అనుకున్నాడు. ఆ తరువాత నాలుగయిదు సార్లు మధుసూధనం మళ్ళీ ఆ ఊరు వెళ్ళాడు. కానీ పద్మ అక్కడ లేదు.

*　　　*　　　*

మరునాడు రుక్మిణి వచ్చి నిద్ర లేపే వరకూ మెలకువ రాలేదు.

'ఏమిటీ తెల్లవారకుండా నే వూడి పడ్డావు' అన్నాడు.

పాపం రాత్రిళ్ళు ఆవిడ కసలు నిద్ర పట్టదట. ఏవేవో విషయాలు చెవుతూ కూర్చుంది' అంది రుక్మిణి.

రుక్మిణి ఎంత మానసికమైన క్షోభను అనుభవిస్తుందో తెలుసుకోవటానికి ఈ ఒక్క ఉదాహరణ చాలు. ఆఫీసుకు వెళ్తూ పద్మ దగ్గరకు వెళ్ళాడు. అతను వెళ్ళే పరికి పై కప్పు కేసి చూస్తూ ఏదో ఆలోచిస్తోంది.

'రాత్రి అసలు నిద్రపోలేదటగా'

'రుక్మిణి చెప్పిందా?...పాపం నాతోపాటు ఆవిడకు కూడ నిద్రలేకుండా చేసాను'

'ఆవిడ నిద్ర చెడిందని నువ్వేం బెంగ పడనక్కరలేదు పగలంతా విశ్రపోయి మరీ బాకీ తీర్చుకుంటుంది.'

పద్మ నిండుగా నవ్వింది. అంత నిండుగా ఈ మధ్యకాలంలో ఎప్పుడూ నవ్వివుండదేమో!

'ఆఫీసుకు టైము అవుతున్నట్టుంది ఇక వెళ్ళు బావా?' అంది.

'సరే పద్మా! ఏమైనా కావలిస్తే చెప్పు. సాయంత్రం వచ్చేటప్పుడు పట్టుకు వస్తాను'

'ఏమీ అక్కర్లేదు. నిన్న తెచ్చినవన్నీ అలాగే వున్నాయ్' అంది.

పద్మ తన భర్త గురించి అడుగుతుం దనుకున్నాడు. కానీ పద్మ అతని ప్రసక్తే తేలేదు పద్మకు తెలుసు ఆ ప్రశ్నవేస్తే ఏ జవాబు వస్తుందో! పద్మ సంసారం సరిగాలేదని తను చాలసార్లు విన్నాడు. కానీ ఇంత అధ్వాన్నంగా వుందని అనుకో లేదు

ఆ సాయంత్రం ఆఫీసునుంచివస్తూ మళ్ళీ పద్మ దగ్గరకు వెళుతూంటే దార్లో మెట్లమీద నర్సు కనుపించి,

'ఆ స్పెషల్‌వార్డులో పేషెంట్ మీ తాలూకూ కదూ! మధ్యాన్నం ఎటాక్ వచ్చింది. బెడ్ ఖాళీ అనుకున్నాను. ఆవిడ అదృష్టం బావుంది. ఇప్పటివరకు ఫరవా లేదు' అంది.

ఆ పరిస్థితుల్లో పద్మను చూడాలని పించలేదు ఇంటికివెళ్ళి రుక్మిణిని పంపించి రాజారావుకోసం ఊరుమీద పడ్డాడు.

సముద్రపువొడ్డున, జనసమర్దంగావుండే బజార్లో, సినిమాహాళ్ళ గేట్లదగ్గరా వెతికి వెతికి చివరికి విసుగెత్తి ఇంటికి తిరిగివస్తుంటే లక్ష్మిటాకీస్ దగ్గర ఒక సందులో పెద్దమనుషులెవరూ నివసించని ఆ వీధిలో ఒక ఇంటినుంచి బయటకు వస్తూ అతను కనిపించాడు.

'రాజాగారూ!' అన్నాడు తను.

అతను ఉలిక్కిపడి వెనక్కు తిరిగి చూసాడు. 'ఓహో మీరా! ఈ వేళప్పుడు ఇలా వచ్చారేమిటి? పద్మ కులాసాగా వుందా?'

'ఇప్పటివరకూ బాగానే వుంది కానీ ఇక ముందు ఏమవుతుందన్నదే భయం. కనీసం ఈ ఆఖరి క్షణాలలోనైనా మీరు ఆమెకు దగ్గరగా వుండటం చాల అవసరం.'

అతను కాస్సేపటివరకూ మాట్లాడ లేదు.

'సరే నేను తప్పకవస్తాను. మీరు పదండి' అన్నాడు.

కానీ ఆ మరునాడుకూడ అతనురాలేదు. ఆ రోజు పదిగంటలవరకూ చూసి చూసి తను హాస్పిటల్‌కు వెళ్ళాడు.

తను వెళ్ళేసరికి పద్మ లేదు ఆ స్పెషల్ వార్డులో ఏదో నెంబర్ బెడ్‌మీద తెల్లని దుప్పటితో ఆమె తాలూకు భౌతిక కాయం కప్పబడివుంది. రుక్మిణి ఘోరుమని ఏడుస్తోంది.

అంతలో అటువచ్చిన సర్జన్ 'అయాంవెరీ సారీ బ్రదర్...' అన్నాడు.

తను సమాధానం చెప్పలేదు. దుఃఖంతో గొంతు పెగల్లేదు. కళ్ళు జలపాతా లయ్యాయి.

'డోన్ట్ బీ చయిల్డ్' అంటూ భుజం తట్టి వెళ్ళిపోయాడు.

నిన్నటి వరకూ వున్న పద్మ ఇప్పుడు లేదు. ఇక వుండదు. ఈ సత్యం భరించ రానిదిగా వుంది. రుక్మిణితో ఇంటికి ఆ రోజే తిరిగి వచ్చాడు తను. ఆ మరునాడు మాసిన గెడ్డంతో చిరిగిపోయిన బట్టలతో రాజారావు వచ్చాడు. తను మాట్లాడలేదు. అతనే అన్నాడు.

'నన్ను క్షమించాలి. నిన్న ఎంత ప్రయత్నించినా రాలేకపోయాను'

— 'మీరు రావలసిన అవసరం నిన్నటే

రెండో సుద్దు కూడా సద్దుదామనుకున్నా గాని
'వాడి శరీరం కొయిలా వుందిరా!



తీరిపోయింది. మీారు ఇక్కడికి ఎందుకు వచ్చారో తెలియదు. పద్మ కోసమే అయితే ఇక మీారు హాయిగా మీా ఊరు వెళ్లి పోవచ్చు.'

'పద్మకేమైంది. ప్లీజ్... ప్లీజ్ ... త్వరగా చెప్పండి'

'ఏమీకాలేదు హాయిగా వుంది ఆనందంగా నవ్వుతోంది. జీవితంలో అనుభవించనంత ప్రశాంతగా నిద్రపోతోంది'

'ఎక్కడ... ప్లీజ్... నన్ను వేధించక త్వరగా చెప్పండి'

'సమాధిలో'

అతను కుప్పగా కూలిపోయాడు. జుట్టు పీక్కుంటూ బావురుమన్నాడు. పద్మ తాలూకు మంగళ సూత్రాన్ని వొంటి మీది నగల్ని, ఆమె మిగిల్చి పోయిన డబ్బును అతని చేతి కందిస్తూ 'ఇవన్నీ మీకు మిగిల్చి వెళ్లిపోయింది' అన్నాడు.

'పద్మ! నిజంగా చచ్చిపోయిందా. ఇది నిజమేనా?'

'ఇప్పుడు కన్నీరు కార్చి ప్రయోజనం లేదు. ఇక మీారు వెళ్లి హాయిగా వుండండి. పద్మ మీాకు అడ్డుతొలిగి పోయింది'

మధుసూధనంగారూ, నేను మీారనుకున్నంత దుర్మార్గుడిని కాను పద్మను నేను ప్రేమిస్తున్నాను. పద్మంటే నాకు పంచ ప్రాణాలు.. పద్మ పోయిన తరువాత నేను బ్రతకలేను. శలవు, ఇక నేను వెళ్లి పోతాను.'

అతను వెళ్లిన తరువాత తను భోరున ఏడుస్తూ వుండిపోయాడు. రుక్మిణి తన చేయి పట్టుకొని 'మరణం ముందు మానవులు అల్పులు, మరణమే మానవునికి విముక్తి ప్రసాదిస్తుందని చెప్పిన మీారే ఎందుకు ఇలా దుఃఖిస్తారు' అంటూ లోపలకు తీసుకు వెళ్లి దీపం వెలిగించింది. గదంతా వెలుగుతో నిండిపోయింది.

నాలుగు రోజుల తరువాత రాజారావు ఆత్మహత్య చేసుకున్నాడని ఉత్తరం వచ్చింది.

ఈ వార్త విన్న తరువాత కూడ అతను పద్మను ప్రేమించటం లేదని తను ఎలా అనుకోగలడు? ●

## రంగులరాట్నం

అమెరికా ఖండాల్లో దీనిని, 'అమెరికా సింహం' అంటారు. చురుకుదనం, శక్తి దీనికి సమృద్ధిగా ఉన్నాయి ఆసియా, ఆఫ్రికాలలో 'పిల్లులు' కొన్ని, లక్షలాది సంవత్సరాల క్రితం, అమెరికాకు వలస పోయి, ఈ రూపం పొందాయి.

మనిషితో సావాసం కోరుకొనే జంతువు. సహజంగా మనిషి భయపడ్డా, మనిషిని ఏమీా అనదు. ఒంటరిగా ఉన్న పసివాడికి కూడా హానిచెయ్యదు. ఏ మాత్రం అలికిడి అయినా పోతుంది. అయితే ఇది పిరికి మాత్రంకాదు. పెద్ద పెద్ద జంతువుల్ని సహితం చంపుతుంది. చెవుల పిల్లులు మొదలు దూడలు, చిన్న చిన్న గుర్రాలు దున్నపోతుల్ని కూడా హతం చెయ్యగలదు అయితే అవసరం వస్తే పురుగులు మిడతలు కూడా తి ం టు ం ది. వేటాడుతున్నపుడు చ ప్పు డు చెయ్యకుండా, దొంగచాటుగా ఉండే వేటాడుతుంది. వే ట కు క్క ల్ని తప్పించుకోడానికి, చెట్లు ఎక్కడమే కాకుండా, చెట్టుమీాంచి చెట్టుకు దాటుకొని పోతుంది.

ఉత్తరమెరికాలో కల్లా ఇదే పెద్దపిల్లి. సుమారు అయిదు అడుగుల పొడవు ఉంటుంది. శరీరం మీాద చక్కని ఊదారంగు ఉంది కాని, చుక్కలు గీరలు ఉండవు. తోక సుమారు పొడవుగానే ఉంటుంది.

—బమ్మి కోనేటిరావు

సీరియల్





సి. ఆనందారామం

### జరిగిన కథ

రామచంద్రమీద అభిమానం పెంచుకుంటుంది వారిజ. రామచంద్ర కూడా వారిజని ప్రేమిస్తాడు. గతంలో ఆమె ఒక సినిమాతార అని తెలుసుకున్న తర్వాత అతను గుండెరాయి చేసుకుంటాడు. వారిజ వృత్తిని విరమించుకుని తన కుటుంబానికి సాయ పడుతూవుంటుంది. అయినా ఆమెమీద అందరికీ దురభిమానమే. వారిజ చెల్లెలు లత. రామచంద్రానికి లతతో వివాహం అయిపోతుంది. లతలో వారిజని వూహించుకున్న రామచంద్ర ఆశలు ఫలించవు. వారిజ రామచంద్ర నామస్మరణంతో అదే వూర్లో టీచరుగా ఉద్యోగం సంపాదించుకుంటుంది. రామచంద్ర అనుకోకుండా వారిజను కలుసుకుని ఆమె అంతరంగాన్ని అర్థం చేసుకోడానికి ప్రయత్నించాడు.

## 9

రామచంద్ర ఇచ్చిన బంగారు గొలుసును తెల్లబోయిచూసాడు వీరన్న.

'ఇదేమిటి బాబూ! ఎందుకిది?'

'రంగనాయకికి ఇయ్యమని వారిజ ఇచ్చింది—'

'వారిజగారా? ఆవిడ ఇక్కడికి వచ్చారా?'

ఆశ్చర్యంగా అడిగాడు వీరన్న.

'ఊ!'

పరధ్యాన్నంగా ముక్తసరిగా చెప్పాడు రామచంద్ర—

వీరన్న కొన్ని క్షణాలు రామచంద్ర ముఖంవంక చూస్తూ మాట్లాడకుండా ఊరుకుని చివరకు తగ్గ స్వరంతో,

'మీ రింకా ఆవిడను కలుసుకుంటూనే ఉన్నారా?' అన్నాడు.

రామచంద్ర విసురుగా 'అంటే?' అన్నాడు—

నేను మీకు చెప్పవలసినవాడిని కాను—కానీ...'

'చెపుతున్నావు— నన్ను కాల్చుకుతినే పతి ప్రతామతల్లి లతను వదిలి నా అశాంతిని మటుమాయం చేయగల మధుర మూర్తి వారిజ దగ్గిరకెళ్లి పతితుణ్ణయిపోతున్నా నని నీ బాధ—అవసరంలేదు — బాధపడకు— ఆ అదృష్టం నా ముఖాన్న లేదు—నిన్న కాకతాళీయంగా వారిజను కలుసుకున్నాను—అంతే!'

కసిగా అన్నాడు రామచంద్ర—

'బాబూ! మీరిలా బాధ పెంచుకుంటే ప్రయోజనంలేదు—లతమ్మగారు చిన్నపిల్ల —ఆవిడకు నచ్చజెప్పి...'

'ఆవిడ చిన్నపిల్ల—నేను ముసలివాడిని—కొన్ని కొన్ని విషయాలు చెపితే వింటే వచ్చేవికావు—సహజంగా రావాలి—'

కోపంతో భగ్గుమన్నాడు రామచంద్ర—

'మీరు ముందే చికాకుతో ఆవిడను సమీపిస్తారు—ఆవిడ ఏదీ అర్థం చేసుకో లేని అమాయకురాలు ఎలా బాబూ'

'అమాయకురాలు కాదు—మూర్ఖురాలు —అమాయకత్వం అందంగా ఉంటుంది— మూర్ఖత్వం చిదరెత్తిస్తుంది—నీకు తెలీదు వీరన్నా! నేను వారిజ దగ్గిరకి వెళ్లానని తెలిసినా లత ఏం బాధపడదు — ఆవిడకు కావలసినవి చీరలూ, నగలూ—అంతే! నేనే తెంచలేక పోతున్నాను — ఏ మాత్రమూ ఆర్ద్రతలేని అనుబంధాన్నుండి విముక్తి పొందటానికి నా సహజ సంస్కారమే అడ్డు వస్తోంది—కానీ, ఎంతోకాలం ఇలా ఉండగల నని తోచదు— ఈ మోడు బ్రతుకు నేను బ్రతకలేను—'

విసురుగా వెళ్ళిపోయాడు రామచంద్ర—

నిర్ఘాంతపోయాడు వీరన్న—

లతా, రామచంద్రల దాంపత్యం అన్యోన్యంగా లేదన్న సంగతి వీరన్నకు తెలుసు—

ఈ పరిస్థితికి ఆవేదనతో అలమటిస్తున్నాడు రామచంద్ర—అలాటి స్థితి ఉందని కూడా తెలియని మూఢురాలు లత—రామచంద్రకు వారిజపైగల అనురాగం వీరన్నకు తెలుసు — వారిజను అతి గాఢంగా ప్రేమించి, ఆమెను పొందలేక ఆర్తితో వేగిపోతోన్న సున్నిత మనస్కుడు రామచంద్ర—అతని నర్థం చేసుకుని, మిగిలిన మమకారాలన్నీ అతడు మరచిపోయేలాగ తన ప్రేమలో ముంచివేయగల రాగమయి అతనికి లభించిఉంటే బాగుండేది. స్పందనే ఎరుగని పరమ లౌకికురాలు భార్య అయింది.

ఈ చికాకులకు తట్టుకోలేక రామచంద్ర

మళ్లీ వారిజను ఆశ్రయిస్తే? అసలు వారిజ మళ్లీ ఇక్కడి కెందుకొచ్చినట్లు? తనకూ వారిజ అంటే ఏదో ఆర్ద్ర భావమే కలుగుతుంది — వెకిలిమనిషిగా కనిపించదు — అయినా రామచంద్ర వారిజ వలలో పడి సంసారాన్ని దూరం చేసుకుంటే సహించలేడు. వారిజలో ఏవో కొన్ని ఉత్తమగుణాలు ఉంటే ఉండవచ్చుగాక! ఐనా ఆవిడజగత్తు ఇదికాదు—ఆ జగత్తులోకి రామచంద్ర ఆకర్షింపబడకూడదు—అధఃపతనం తప్ప మరి వ్యామోహాలనుండి విముక్తి ఉండదు—

రంగనాయకికి ఆ గొలుసు అందించాడు వీరన్న—

తెల్లబోతూ 'ఇదెక్కడిది?' అంది—

'వారిజగారు ఇచ్చారు—'

'ఆవిడెవరు?'

'ఒక సినిమాతార—'

'సినిమాతారా? నాకు చూపించవా మావా? మనకి కనిపిస్తారా? నీ కెలా తెలుసు?'

సంబరంగా అడిగింది రంగనాయకి—

విస్తుపోయి చూసాడు వీరన్న—

ఏవిటీ వెర్రి, సినిమాతార అయినంతలో ఏవిటుంది ఆవిడలో? ఎందుకు రంగనాయకి కింత ఉబలాటం ఆవిడను చూడటానికి?

'ఎందుకు చూడటం?' విసుగ్గా అన్నాడు—

వీరన్న విసుగు కనిపెట్టి బుంగమూతి పెట్టింది రంగనాయకి—

'ఎందుకు మావా అట్లా విసుక్కుంటావు? చూస్తే ఏం పోయింది? వాళ్ల వేషాలన్నీ నేను నేర్చుకుంటాననా? ఛీ! పాడు! సరదాకి చూస్తాను కాని. ఆ వేషాలన్నీ ఎవరికి కావాలి?'

'నువ్వూ ఓ తార వయిపో!' వెక్కిరింపుగా అన్నాడు—

'చాల్లే! ఆ బతుకూ ఒక బతుకేనా?' మూతి తిప్పుకుంటూ అంది రంగనాయకి—



## చీకటి కడుపున...

ఒక ప్రక్క అసహ్యం—మరొక ప్రక్క ఆకర్షణ — తనలో తను నవ్వుకున్నాడు వీరన్న—

'తీసికెళ్తాలే! అవి ఎక్కడున్నారో నాకు తెలీదు — తెలిశాక తీసికెళ్తాను—' అన్నాడు పొడిగా—

'ఎక్కడున్నారో తెలీకుండా గొలుసెలా తెచ్చావు?'

'నేను తేలేదు — రామచంద్ర బాబు తెచ్చారు—ఆయన కిచ్చారు ఆవిడ—'

'ఓహో! రామచంద్ర బాబుకీ, ఆవిడకీ స్నేహమన్న మాట!' కళ్లు తమాషాగా తిప్పుతూ, అదోకరకంగా అంది—

'ఛీ! నోరు మూసుకో!' కసురుకున్నాడు వీరన్న—

రంగనాయకికి కష్టం తోచింది—

'నేనేం తప్పుమాటన్నాను? ఎంతస్నేహం లేకపోతె, బంగారు గొలుసిస్తారు? నువ్వు చెప్పు స్నేహంలేదని లెంపలేసుకుంటాను—'

వీరన్న మాట్లాడలేదు—మూతిముడుచుకుని కూర్చున్నాడు—రామచంద్రపై వీరన్నకు గల అభిమానం తెలిసిన రంగనాయకి అతడి ఆవేదనను అర్థంచేసుకుంది—

అతడిని మరిపించడానికి మల్లెమొగ్గలున్న పళ్లెం తీసుకుని దగ్గరగావచ్చింది—

'చూడు మావా! ఎంత బాగున్నాయో, ఈ మల్లెపూలు! నే స్వయంగా పూయించాను—'

'కొంచెం పూలు లతగారి కిచ్చి రాకపోయావా?'

చటుక్కున ముఖం ముడుచుకుంది రంగనాయకి—

'ఆవిడకు వళ్లుమాలిన గర్వం బాబూ! మర్యాద అక్కర్లేదు—పోనీ ఆదరంగా పలకరించనైనా పలకరించదు — ముఖమంతా ముటముట లాడించుకుని ఎందుకొచ్చావన్నట్లు మాట్లాడుతుంది—నువ్వేంచెప్పినా వింటాను కాని లతగారి దగ్గరకు మాత్రం వెళ్లమనకు—'

ఉసూరుమని నిట్టూర్చి ఊరుకున్నాడు వీరన్న—

* * *

చిన్న పల్లెటూరు — వారిజ ఎక్కడుంటుందో తెలుసుకోవటానికి ఎక్కువకాలం పట్టలేదు వీరన్నకి — వారిజ అక్కడే స్థిరపడిపోయి ఉద్యోగంలో జేరిందని కూడా విన్నాక గుండెల్లో రాయి పడ్డట్లే అయింది—

సంజవేళ వారిజ యింటికి బయలుదేరాడు వీరన్న వీరన్నను చూడగానే సంభ్రమంతో వారిజ ముఖం వికసించింది.

'రా! రా! వీరన్నా! ఎన్నాళ్లకు కనిపించావు? పెళ్లి చేసుకున్నావుటగా! మీ ఆవిడను కూడా తీసుకరాకపోయావా? చూసేదాన్నిగా! అయినా నా మీద నీకింత అభిమానముందని నాకు తెలీనే తెలీదు వీరన్నా! తెలిస్తే నేనే మీ ఇంటికి వచ్చేదాన్ని. మనుష్యుల్లో జాలీ, సానుభూతీ, చాలామందిలోనే ఉన్నాయి వీరన్నా!'

వీరన్న తల దించుకున్నాడు — వారిజ ముఖంలో తనను చూడగానే ప్రతిఫలించిన సంతోషమూ, ఆవిడ కంఠంలో ధ్వనించిన ఆప్యాయతా అతణ్ని లజ్జితుణ్ని చేసాయి.

వారిజపట్ల దయతోనూ, సానుభూతితోనూ వచ్చాడా తానిక్కడికి?

తల వంచుకు నిలబడ్డ వీరన్నకు కుర్చీ తెచ్చి వేసింది వారిజ.

'కూర్చో వీరన్నా!'

ఆ మర్యాదకు తలక్రిందులయిపోయాడు వీరన్న

'పరవాలేదమ్మా! ఇలా కూర్చుంటా లెండి—' క్రింద కూర్చోబోయాడు.

'ఆహా! అలా వీల్లేదు వీరన్నా! కుర్చీలో కూర్చో! మీ అయ్యగారి దగ్గర నీకీ మర్యాదలన్నీ! నా దగ్గర దేనికి? నీకన్నా నిర్భాగ్యురాలిని నేను—'

'వారిజ కంఠం గద్గదమయింది.

కన్నీటి బిందువులతో మిల మిల లాడుతూ దైన్యంగా చూస్తోన్న వారిజ కళ్లల్లోకి చూసి తల దించుకున్నాడు వీరన్న.

అంతలో కళ్లు తుడుచుకుని లోపలికి వెళ్లి కాఫీ కప్పు తీసుకొచ్చి వీరన్న కందించింది వారిజ.

వణికే చేతులతో అందుకున్నాడు వీరన్న.

తాను చెప్ప దలుచుకున్నది ఎలా చెప్పటం?

చటుక్కున స్ఫురించింది వీరన్నకు—తనే ఇలా అయిపోతోంటే రామచంద్ర ఈ

యువతి ముందు కరిగిపోవటంలా ఆశ్చర్య మేముందీ?—అని.

కాఫీ తాగి కప్పు కడగబోతుంటే చటుక్కున అందుకుంది వారిజ—

'నువ్వెందుకు కడగటం? పని మనిషి వస్తుంది—' కప్పు లోపల పెట్టివచ్చి, అతనికి ఎదురుగా మరో కుర్చీలో కూర్చుంది వారిజ.

'మీ బాబుగారు బాగున్నారా?'

వీరన్నకు సందు దొరికింది—

'ఏ బాగులేమ్మా! అన్నీ ఉన్నాయి సుఖం తప్ప అన్నట్లుంది—మనమంతా కలిసి ఎలాగైనా ఆయన సుఖపడేలా చూడాలి—'

'ఏదేం వీరన్నా!'

ఆందోళనగా అడిగింది.

'బాబుగారు నిన్న రాత్రి ఇక్కడికి వచ్చారుట కదమ్మా! ఆయనేం చెప్పలేదా?'

'ఉహూ! ఏం చెప్పలేదే! సంగతేమిటి వీరన్నా!'

'అవడానికి మామూలు విషయమే అమ్మా! కానీ బాబుగారు గోరంతను కొండంతగా చేసుకుని బాధ పడుతున్నారు'

'విషయం చెప్పు—'

'బాబుగారి భార్య అదోక రకం మనిషి—మంచిదే కానీ చీరల మీదా, నగల మీదా మోజు—బాబుగారి మనసు అర్థం చేసుకోదు—నోటికేంతోస్తే అంత మాట్లాడుతుంది బాబుగారు లోలోపల విరక్తి పెంచుకుంటున్నారు—' దీర్ఘంగా నిట్టూర్చింది వారిజ—

'ఇందులో అంత విరక్తి పెంచుకోవలసిందేముందీ? చీరలమీదా, నగలమీదా మోజు మూడువంతులు ఆడవాళ్లకందరికీ ఉంటుంది—ఇంక ఒకరినొకరు అర్థంచేసుకోవటానికి కొంతకాలం పడుతుంది—ముందు బాబుగారే ఆవిడను అర్థంచేసుకుని ఆవిడకు సంతృప్తికలిగేలా ప్రవర్తిస్తే ఆవిడ కూడా నెమ్మదిమీద ఆయనను అర్థం చేసుకుంటుంది — ఎవరో ఒకరు సర్దుకుపోవాలి కాని, ఇలా విరక్తి పెంచుకుంటే ఎలా?'

వీరన్న ముఖం వికసించింది—

'అదేనమ్మా! నేనూ అనటం—లతగారు అమాయికురాలు—' ఉలిక్కిపడింది వారిజ—

'ఆవిడ పేరేమిటి?'

'లత—'

'ఏ వూరు?'

'బెజవాడ—'

'ఎవరమ్మాయి?'

'ప్లీడర్ సత్యనారాయణగారి అమ్మాయి'

వారిజ తల గిరగిర తిరగసాగింది—ఆనాడు లత పెళ్లి చూడాలని గంపెడు ఆశతో వచ్చి అవమానం పొంది వెళ్లిపోయాక లత పెళ్లిగురించిన వివరాలే తెలుసుకోలేదు—రామచంద్ర పెళ్లి చేసుకున్నది లతనా?

'మీకు తెలుసా అమ్మా!'

కళవెళపడిపోయింది వారిజ—

'అహా? తెలీదు—నాకేం తెలీదు—'

'నన్ను క్షమించండమ్మా ఒక్క విషయం చెప్తున్నాను—బాబుగారికి మనసులో మీమీద ప్రేమ ఏమాత్రం తగ్గలేదు—ఆ కారణం చేత లతగారి దోషాలు ఒకటికి పదింతలుగా కనిపిస్తున్నాయి — ఈ స్థితిలో...' ఆగాడు వీరన్న—

వారిజ గుండెలు పగిలిపోతున్నాయి—

తన బ్రతుకు ఇలా మండిపోయినా, కనీసం తన చెల్లెలయినా సుఖపడుతోందని సంతృప్తిగా ఉండేది మనసులో! చివరకు తన చెల్లెలు జీవితంలోనూ సుఖంలేదా? అయ్యో! ఏం మనుష్యులు? తమకు లభించిన అపూర్వ సంపద విలువ తెలిసికోలేక చేజేతులా జీవితాన్ని దుఃఖమయం చేసుకునేవాళ్లని ఏమనాలి?

వారిజ కళ్లలో నీళ్లుచూసి బాధపడ్డాడు వీరన్న—

'అమ్మా! మీరలా కళ్లనీళ్లు పెట్టుకుంటే నేనేం చెప్పలేను—'

వారిజ పైటకొంగుతో కన్నీళ్లు తుడుచుకుంది—

'చెప్పు—'

'మీరు బాధపడకూడదు — ఈ స్థితిలో బాబుగారి మనసులో మీ పట్ల ఆకర్షణ పెరిగిందంటే, ఆయన సంసార జీవితం మరింత నరకంగా తయారవుతుంది—బాబుగారు మొదటి నుంచీ నియమ నిబంధనలతో పెరిగిన వ్యక్తి—జీవితంలో భోగాలకు కంటె విలువలకు ప్రాధాన్యం ఇస్తారు—ఒక్కసారి, ఆ విలువలు పడిపోతే ఆ నియమాలు సడలిపోతే, ఎక్కడకు కొట్టుకుపోతారో ఎవరు చెప్పగలరు?'

తెల్లగా పాలిపోయిన ముఖంతో వీరన్న ముఖంలోకి చూసింది వారిజ—

'ఏమిటి వీరన్నా! నువ్వు మాట్లాడేది?'

'మిమ్మల్ని బాధపెడ్తున్నానమ్మా! మీరు బాబుగారిని ఎంత గాఢంగా ప్రేమిస్తున్నారో నాకు తెలుసు — ఉజ్జ్వలమైన మీ భవిష్యత్తు నంతా వదిలి ఈ మారుమూల గ్రామంలో మామూలు పంతులమ్మలా ఎందుకు జీవితం గడుపుతున్నారో కూడా తెలుసు—'

చేతులలో ముఖం కప్పుకుని వెక్కివెక్కి ఏడవ సాగింది వారిజ—

'మీరెంత బాధపడినా చెప్పక తప్ప



అమ్మా! ఇప్పుడు గనుక మీరు బాబుగారికి దూరంగా ఉంచకపోతే ఒక అమాయకు రాలి జీవితం నాశనమయిపోతుందమ్మా!'

'అవు వీరన్నా! నే నిక్కడికి మీ బాబు గారితో సుఖాలు అనుభవించడానికి రాలేదు— కనీసం ఆయనను చూసుకోవచ్చును గదా అని ఆశపడ్డాను—మీబాబుగారికోసం సినిమా జీవితం వదిలిపెట్టలేదు—నాకే విరక్తి కలిగి వదిలిపెట్టాను — నువ్వన్నట్లు ఆయనను గాఢంగా (ప్రేమించినమాట నిజమే! కానీ, ఆయనలో పాశవిక శక్తులను రెచ్చగొట్టి నాకు బానిసను చేసుకోవాలనే ఉద్దేశం నాకెన్నడూలేదు— వీరన్నా! నన్ను నమ్ము'— కుమిలి కుమిలి ఏడ్చింది వారిజ—

వీరన్న బాగా కదిలిపోయాడు—

'నాకు తెలుసమ్మా! మీలో ఆ నమ్మకమే లేకపోతే, నేనిప్పుడు మీ దగ్గరకు వచ్చే వాడినే కాదు— నమ్మకం పోతున్నది మీలో కాదు — బాబుగారిలో — ఆ లతమ్మ ఒక్క తెలివితక్కువది—అసలే విరక్తిలోఉన్న బాబు గారు మీమీద మోజు పెంచుకుని ఆవిడ మీద మరింత విరక్తి పెంచుకుంటారని భయపడి వచ్చాను— నాకెందుకో బాబుగారు మళ్ళీ మీదగ్గరకు వస్తారని ఉంది—బాబు గారి మనసు లతమ్మగారిమీదకు మళ్ళించ గల సామర్థ్యం మీకేఉంది — చూడండి, ఎంత కసాయివాణ్నో? మిమ్మల్ని కోరు తున్నాను ఈ సహాయం.' వారిజ కళ్ళు తుడుచుకుని (ప్రశాంతంగా నవ్వింది—

'లతా, మీ బాబుగారు అన్యోన్యంగా ఉండి సుఖపడాలని నువ్వెంత కోరుకుంటు న్నావో, అంతకంటె ఎక్కువగా నేను కోరుకుంటున్నాను — అందుకోసం నేను చెయ్యగలిగిందంతా చేస్తాను — ఈ విష యంలో నువ్వు నన్ను (ప్రాధేయపడ వలసిందేం లేదు—'

'మీరింత మంచివారని నాకు తెలు సమ్మా! వస్తాను—' నమస్కారం చేసి సంతృప్తిగా వెళ్ళిపోయాడు వీరన్న —

* * *

ఉంటున్నది అద్దె ఇల్లయినా, ఇంటి ముందు చిన్న పూలతోట పెంచింది వారిజ — స్కూల్ పని అయిపోగానే సాయంత్రం ఆ పూల మొక్కలకు గొప్పులు తవ్వటంలో, నీళ్ళు పట్టటంలో రకరకాల దోహదాలు చెయ్యటంలో లీన మయి పోతుంది—మొదట్లో వంటరితనం భయంకరంగా అనిపించేది — కానీ, ఈ పూలతోట (ప్రారంభించిన దగ్గిర నుంచీ మొక్కలే ఆమెకు ఆత్మబంధువులయి పోయాయి— ఈ మొక్క వడిలి పోతోంది— బెంగ—

ఆ మొక్క చిగురేసింది — ఉత్సాహం — మరో మొక్క మొగ్గ తొడిగింది — అంతులేని ఆనందం — విరిసిన ఆ పూల వంక చూసుకుంటూ తనను తను మరిచి పోతుంది— సుకుమారమైన ఆ పూవులను తన చెక్కిళ్ళ కానించుకుని పరవశించి పోతుంది—రంగు రంగుల సౌందర్యంతో వింత వింత సౌరభాలతో ఊగిపోయే ఆ పూల మధ్య నిలిచి విశ్వశిల్పి కళా చాతు ర్యానికి ఆశ్చర్య పోతుంది —

గులాబి మొక్కల చుట్టూ గొప్పులు తవ్వి రోజ్ మిక్చర్ కలుపుతోన్న వారిజ 'వారిజా!' అన్న పిలుపుకు ఉలికిపడి తలెత్తింది—

నవ్వుతూ నించున్నాడు రవి—

రవిని చూడగానే ముఖం ముడుచు పోయింది వారిజకు — పవిత్రమైన ముని పల్లెలోకి ఎవరో కిరాతకుడు అడుగు లెట్టినలాటి భావన కలిగింది—



'ఆశ్చర్యం! ఎప్పుడొచ్చావ్!' అంది పొడిగా—

'నిన్ననే వచ్చాను — లత ఇంట్లో దిగాను — లత ఇక్కడే ఉంటోంది, నీకు తెలుసుగా! నువ్వు ఇక్కడికెందుకొచ్చావ్? వస్తున్నట్లు నాకు చెప్పలేదేం? నీ ఎడ్రస్ తెలియక నానా అవస్థపడ్డాను—'

'ఇప్పుడెలా తెలుసుకున్నావ్?'

'దైవికం— ఏంతోచక ఊరంతా తిరు గుతూ ఇలా వచ్చాను—నువ్వు కనిపించావు— లతను చూసావా?'

'ఎలా చూస్తాను? లత ఇక్కడున్నట్లు నాకెవరు చెప్పారు? అసలు లత పెళ్ళి ఎవరితో నిశ్చయమయిందో కనీసం ఆ విషయమన్నా నా చెవిని వెయ్యాలని ఎవ రనుకున్నారు? అవునులే! మీ కందరికీ నేను చచ్చిపోయినదాన్నిగా!'

'అలా నిష్ఠూరంగా మాట్లాడకు వారిజా! నీకుమాత్రం తెలియనిదేముంది?'

'నిష్ఠూరం ఎవరిమీద వేస్తాను? ఏ అధికారంతో వేస్తాను? అవును — అన్నీ తెలుసు— అందుకే భరిస్తున్నాను అంతా! ఇదంతా సరేలే! లత కులాసాగా ఉందా?'

'ఏం కులాసాలే! ఎద్దుమొద్దులాంటి మొగుడు దొరికాడు—'

అదిరిపడింది వారిజ—

'ఏమన్నావ్?' అంది తీక్ష్ణంగా—

ఆ తైక్ష్ణ్యానికి ఆశ్చర్యమూ, భయమూ కలిగింది రవికి—

'లత మొగుడి సంగతి—' అన్నాడు వివరిస్తున్నట్లు— తనను తను నిగ్రహించు కుని గంభీరంగా అంది వారిజ—

'అదే! ఎద్దుమొద్దుతనం ఏం చూసా వని అడుగుతున్నాను—'

'నువ్వొక్కసారి చూస్తే నీకే అర్థ మవుతుంది—బి.ఎస్‌సి. పాసయ్యాడు పల్లె టూరి రైతులా పంచే, చొక్కా — అదీ అవతారం — హాయిగా ఉద్యోగం చేసుకో రాదూ! స్వంత వ్యవసాయం అంటూ ఈ పల్లెటూళ్ళోపడి ఉండకపోతే— నాలుగెకరా లతో వ్యవసాయం చేస్తేమాత్రం ఏం వస్తుంది? అయినా అటు ఉద్యోగమూ, ఇటు వ్యవసాయమూ కూడా చేసుకో వచ్చుగా! — ఏమిటో అదొక్కలా ఏడు స్తోంది—'

'లత ఏడుస్తోందా?'

[illegible]

ఉద్యోగం చూసుకుని ఈ కాస్త పొలమూ అమ్మేసి ఇల్లు కొనుక్కుందామని చెప్పిం దిట! ఆయన వినలేదు—'

'పచ్చని పొలాలు చూసుకోవటంలో, పొలాలమధ్య తిరుగుతూ పనిచేసుకోవటంలో ఆయనకు ఆనందం ఉందేమో? అదెందుకు అర్థంచేసుకోరు? అందరికీ డబ్బే ప్రధానం కాదు—'

'ఆనందమా! మట్టిలో బురదలో ఆనందం ఎక్కణ్ణుంచి వస్తుంది? అవునులే నువ్వూ...'

'అలాంటి ఎదుద్దుమొద్దువే!...'

వాక్యం పూర్తిచేసింది వారిజ—

'ఛ! నేనలా అన్నానా?'

'అవునులే! నా దగ్గిర్నుంచి నీకు డబ్బు కావాలి కనక—'

'నీ కెలా తెలుసు?'

'అందుకు కాక నువ్వు నా దగ్గిర కెందుకొస్తావ్? అదిసరే! లత విషయం చెప్పు— లతేదుస్తే నువ్వేం అన్నావ్?'

'ఏడవకు — బావగారికి చెపుతానని' ఓదార్చాను— బావగారికి చెప్పాను — ఆయన నా మాటల కసలు ఒప్పుకోలేదు — నువ్వన్నట్టే అన్నారు — 'నాకిందులో ఆనంద ముంది—' అని — లత 'నాకీ పల్లెటూరు నరకంలా ఉంది. అంటో ఏడ్చింది — అప్పటికీ ఆయన మనసు కరగలేదు — పైగా నీక్కావలిసిన స్వర్గంలోకి నువ్వెళ్లు' అంటూ మూర్ఖమో!'

'అవును మూర్ఖమే!'

ఉద్రేకాన్ని నిగ్రహించుకొంటూ అంది—

'తరువాత?.........'

'తరువాతేముంది? లత కుళ్లి కుళ్లి ఏడ్చింది. 'ఏం చేస్తాం! మన ఖర్మ ఊరుకో!' అని ఓదార్చాను—అధైర్యపడక ఎలాగైనా పోరి ఆయన ఈ పల్లెటూరు వదిలేలా చెయ్యమని బోధపరిచి వచ్చాను.'

'ఛీ! ఎంతపని చేసావ్! పైగా సిగ్గు లేకుండా చెప్పుకుంటున్నావా?'

'ఏవిటి వారిజా! ఇందులో అంత సిగ్గు మాలిన పని?'

'ఇంకా వెమ్మదిగా అడుగుతున్నావా? చిన్నపిల్ల దానికి తెలియక బంగారంలాంటి సంసారంలో కలతలు రేపుకొంటూంటే సర్దటానికి బదులు ఆ కలతలు మరింత రెచ్చగొడతావా? ఇప్పుడు దానికేం లోటు వచ్చిందని అది ఏడవటానికి? నువ్వు ఓదార్చటానికి? తనను మొగుడు అర్థం చేసుకోవటంలేదే అని బాధపడుతుందే కాని, తను మొగుణ్ని అర్థం చేసుకోవడానికి ప్రయత్నించదేం? దాని నైలాన్ చీరలు ఆయన కిష్టం లేకపోయినా సహించటం లేదా? ఆయన పంచ కట్టుకోవటం దానికి నచ్చకపోయినా సహించాలి అసలు ముందు తన భర్తను ప్రేమించటం నేర్చుకోవాలి— ప్రేమతో ఆయన మనస్సు వశం చేసుకుని తీర్చుకోవాలి — దానికి సర్ది చెప్పటానికి బదులు రెచ్చగొట్టి వచ్చావు— భర్తను పోర మని సలహా యిచ్చావు— నీ సలహా ప్రకారం అది భర్త చెవులో పోరు పెడితే, ఆ పోరు పడలేక ఆయన దానివి వదిలేస్తే—దాని గతి ఏమవుతుంది? నువ్వు పోషిస్తావా, దాన్ని? మనలో కనీసం అది ఒక్కతె అయినా సుఖంగా ఉండటం నీకు నచ్చలే దులావుంది—'

అత్యంత తీక్ష్ణంగా పిడుగులు కురి పిస్తూ మాట్లాడుతోన్న వారిజను నోట తెలపోతూ చూసాడు రవి—

చివరకు తలవంచుకుని 'పొరపాటయి పోయింది వారిజా!' అన్నాడు—

వారిజ ఏం సమాధానం చెప్పలేదు — దీర్ఘంగా నిట్టూర్చింది—కొంతసేపాగి రవి నసుగుతూ అడిగాడు—

'వారిజా! నీ దగ్గిర డబ్బేమైనా ఉంటే...ఇంట్లో ఇబ్బందిగా ఉంది...'

వారిజ కెంతో కోపం వచ్చింది — నా దగ్గిరేం లేదని అనెయ్యబోయింది — నోరు రాలేదు— ఇరవైరూపాయలు తెచ్చి రవి చేతిలో విదిలిస్తున్నట్లుగా పెట్టింది— ఈ విదిలింపులు రవికి లెక్కలేదు — సంతోషంగా వెళ్లిపోయాడు—

రవి వెళ్లిన వైపే దిగాలుగా చూస్తూ నిల్చుంది వారిజ—

(ఇంకా ఉంది)




ఒకప్పుడు రాజు, కొద్ది మంది సైనికులతో కలసి వేటకు వెళ్ళాడు. అడవిలో దక్షిణ దేశపు సైనికులు రాజును ఆకస్మికంగా చుట్టుముట్టి, బంధించి వేశారు. తరువాత వారు రాజును తమ రాజధానికి తీసికొని వెళ్ళారు.

'సగం రాజ్యాన్ని యిచ్చినట్లయితే మీ రాజును వదలి పెడతా' నని దక్షిణ దేశపు రాజు మల్లన్న మంత్రికి కబురు పంపించాడు.

'అర్ధరాజ్యాన్ని మీకు యివ్వడానికి అభ్యంతరం యేమీలేదు. రాజుగారి కంటే మాకు అర్ధరాజ్యం యెక్కువ కాదు. అయినా యీ విషయంలో నిర్ణయాన్ని తీసికొనేముందు మా రాజుగారితో ఒకసారి మాట్లాడ వలసి ఉంది. మా రాజ్యపు సరిహద్దు దగ్గర ఉన్న నది ఒడ్డున నేను వారిని కల్సుకొంటాను' అని మల్లన్న మంత్రి దక్షిణ దేశపు రాజుకు సమాధానం పంపించాడు.




మల్లన్న మంత్రి రాజును కల్సుకోవడానికి వచ్చినప్పుడు మల్లన్న మంత్రిని కూడా బంధించవచ్చునను కొన్నాడు దక్షిణ దేశపురాజు. అందుచేత మల్లన్న మంత్రి రాజును కల్సుకోవడానికి దక్షిణ దేశపురాజు అంగీకరించాడు. అయితే రాజును కల్సుకోవడానికి మల్లన్న మంత్రి ఒంటరిగానే రావాలని ఒక షరతును విధించాడు.

రాజును కల్సుకోవడానికి నది ఒడ్డున ఒక గుడారాన్ని నిర్మింపజేశాడు మల్లన్న మంత్రి. అయిదు వందల మంది దక్షిణ దేశపు సైనికులు అక్కడకు రాజును బంధించి తీసికొని వచ్చారు. మల్లన్న మంత్రి అక్కడకు ఒంటరిగానే వెళ్ళాడు.

రాజు, మల్లన్న మంత్రి గుడారంలోనికి వెళ్ళారు. గుడారాన్ని దక్షిణ దేశపు సైనికులు కాపలా కాస్తున్నారు. రాజు మల్లన్నమంత్రి గుడారంలోనికి వెళ్లి సుమారు రెండు గంటలసేపు అయింది. అప్పటికీ వారు యివతలకు రాలేదు. దానితో గుడారానికి కాపలా కాస్తున్న సైనికులకు అనుమానం కలిగింది.

దక్షిణదేశపు సైనికులు అప్పుడు గుడారంలోనికి తొంగిచూశారు. లోపల యెవరూ కన్పించలేదు. తరువాత వారు లోపలకు వెళ్ళి పరిశీలించగా, ఒక తివాచీ అడుగున సొరంగం కన్పించింది.

రాజు మల్లన్నమంత్రి సొరంగపు దారిగుండా పారిపోయారని దక్షిణ దేశపు సైనికులు గ్రహించారు. అప్పటికి రాజు మల్లన్నమంత్రి సొరంగానికి అవతల వైపునున్న తమ సైనికులను కల్సుకొన్నారు. వెంటనే మల్లన్నమంత్రి సైనికులు దక్షిణ దేశపు సైన్యం మీదపడి, దానిని ఓడించి వేశారు. ●

# సౌండ్ ఆఫ్ మ్యూజిక్


ఆ చిత్రంలో మీ సంగీతం విన్నాక మంచి సంగీతానికీ చెడు సంగీతానికీ ఉన్న తేడా మాకు బాగా తెల్సిపోయింది సార్!


కాపీ కొట్టడం ఎలా నాన్నా — అందులోనూ నీది అందె వేసిన చెయ్యటగా?
"సంగీత రత్న"
సినీ సంగీత దర్శకుడు.


ఇదుగో అబ్బాయ్! లోపలికి రా!?
సంగీత దర్శకుడు


ఏదీ ఇహ పాడూ! మా సినిమాలో డ్యూయట్ కు ఈ ట్యూన్ పెట్టేస్తా!!
Jayadev


ఈసారి ప్రేక్షకులను ఓ కొత్తరకమైన సంగీతం వినిపించాలని..
DRUM

# వారఫలం

**3-5-1968 శుక్రవారం మొదలు**
**9-5-1968 గురువారం వరకు**

**మేషం:** వ్యాపారం భారీయెత్తున చేయడం వలన ఆర్థికంగా ఒత్తిడి వస్తుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. స్థిరాస్థి వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలించగలవు. విద్యావైజ్ఞానికరంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

స్త్రీలకు—విలాస వస్తువులు కొంటారు. దైవకార్యాలు నెరవేరుతాయి.

**వృషభం:** వ్యాపారంలో ప్రయోజనం గల వ్యక్తులను కల్సుకొంటారు. ప్రయాణం ద్వారా కార్య సాధన చేయగలరు. రాజకీయ వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. కొన్ని వ్యవహారాల్లో మీరు మొగమాటాలకు లొంగిపోయే ప్రమాదం ఉంది

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**మిథునం:** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు సామాన్యంగా ఉంటాయి. రావలసి డబ్బు సమయానికి అందుతుంది. సాహిత్యకళారంగాల్లో మీకృషి రాణించగలదు. శుభకార్యాల విషయంలో అనుకూలమైన సంఘటనలు జరుగుతాయి.

స్త్రీలకు—బంధుమిత్రులను కల్సుకొంటారు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కర్కాటకం.** వృత్తిలో మీరు యిదివరకు చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి. నూతన వ్యవహారాలు లాభదాయకంగా ఉంటాయి. ఉద్యోగంలో అధికారుల ఆదరాభిమానాలను పొందగలరు. వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. అలంకార వస్తువులు కొంటారు.

**సింహం:** వారం ప్రారంభంలోనే వృత్తి వ్యాపారాల్లో చికాకులు యేర్పడి తరువాత సర్దు కొంటాయి మీ తాలూకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. ఉద్యోగంలో గౌరవప్రాబల్యాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. అధికవ్యయం జరుగుతుంది.

**కన్య:** మీకు ముమ్ముందు లాభించగల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధించగలరు. సమయానికి యేదో ఒకవిధంగా డబ్బు చేతికి వస్తుంది. వారం మధ్యలో అన్నివ్యవహారాల్లోను చికాకులు కలుగుతాయి. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**తుల:** వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరుతాయి. విద్యావైజ్ఞానికరంగాల్లో మీకృషి రాణించగలదు వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి.

స్త్రీలకు—దైవకార్యాలు నెరవేరతాయి. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**వృశ్చికం** ఇదివరకు మీకు ఆందోళన కలిగించిన వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. వృత్తిలో ఆదాయం బాగా ఉంటుంది. ప్రయాణాలు లాభదాయకంగా ఉంటాయి. స్థిరాస్థి వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి.

స్త్రీలకు—సంతోషకరమైన వార్తలను వింటారు. పాటివారిలో గౌరవం లభిస్తుంది.

**ధనుస్సు:** ఇంతవరకు అనుకూలంగా ఉన్న వ్యవహారాల్లోనే చికాకులు యేర్పడతాయి. ఉద్యోగంలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు. వారంమధ్యలో వృత్తిలో ఆదాయం బాగా ఉంటుంది. ఆర్థిక వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి.

స్త్రీలకు—వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. అధికవ్యయం జరుగుతుంది.

**మకరం.** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు శ్రమ మీద నెరవేరతాయి. సాంఘిక వ్యవహారాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది. వారంమధ్యలో ఆకస్మికంగా చికాకులకు గురి కాగలరు. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది

స్త్రీలకు—కుటుంబ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి బంధుమిత్రులను కల్సుకొంటారు.

**కుంభం.** రావలసిన డబ్బు సమయానికి అందక పోవడం వలన యిబ్బంది కలుగుతుంది. వృత్తిలో పాటివారితో పోటీ పెరుగుతుంది. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. కోర్టు వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. ప్రయాణాలోచనలు చేస్తారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

**మీనం:** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ప్రయాణం ద్వారా కార్యసాధ చేయగలరు. విద్యావైజ్ఞానికరంగాల్లో మీకృషి రాణిస్తుంది. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాల సంచలనం పెరుగుతుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. దైవకార్యాలు నెరవేరతాయి.

—మహేష్ ●

# మీ చర్మాన్ని పుష్పదళం లాగ మెత్తగా, మృదువుగా యౌవనంగా వుంచుకోండి...

ఇందుకు మీ చర్మమందలి స్వాభావిక తేమను మీరు నిలబెట్టుకోవాలి. పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్‌లోగల ఒక ప్రత్యేకమైన పదార్థము 'హ్యూమెక్టెంట్' చర్మపు తేమను నిలబెట్టి మీ చర్మాన్ని దుమ్ము, వాతావరణమునుండి రక్షిస్తుంది. తేలికైన, మంచువంటి పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్ మిమ్మలిని సొగసుగా కనబడేటట్టు వుంచి మీ చర్మాన్ని ఎల్లప్పుడు అందంగా, మృదువుగా, యౌవనంగా వుంచుతుంది. పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్ మాత్రమే రాసుకొంటే మీ ముఖము సహజ మనోహరత్వముతో వుంటుంది. లేకపోతే అది రాసుకొన్న తరువాత పౌడర్ అద్దుకోవచ్చును. అప్పుడు పౌడర్ గంటల కొలది ఏక రీతిగా అంటుకొని వుంటుంది. పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్: ప్రపంచమంతటా అందకత్తెలు వాడే క్రీమ్!




**పాండ్స్** వ్యానిషింగ్ క్రీమ్ పౌడర్ అద్దుకొనుటకు ఉత్తమమైనది

చీస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్ (పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఎ.లో స్థాపించబడినది)




■ బొమ్మరైలు పరుచుకుని ఆడుకుంటున్న బుజ్జిగాణ్ణి చూసి ముచ్చటపడి పోతున్నారు నాన్నారు. ఆ ఆరేళ్ల కుర్రకుంకా రెండు నిముషాలు దానికేసి అటూ యిటూ చూశాడు. ప్రాణం విసిగినట్టుంది— ఇంకేదైనా ఉంటుందేమోనని అక్కణ్ణుంచి లేచ్చక్కా పోయాడు!

'కుర్రాడింకా చిన్నవాడుకదూ. అయితే నేం వాడికి రైలుంది కదా—అదీ ముఖ్యం' అన్నట్టు చూశారు గుడ్లురిమి చూస్తున్న అమ్మకేసి. 'నేను చిన్న పిల్లాడుగా ఉన్నప్పుడు నా కెన్నడూ ఎవరూ ఏమీ ఇవ్వలేదు. ముద్దుచెయ్యలేదు. నా కొడుక్కి అలా జరగనివ్వను.' అని వివరించారు నాన్నగారు. అదీ అసలు సంగతి. కష్టాలలో పుట్టి కష్టాల మధ్య పెరిగి పెద్దవారై స్వశక్తిమీద పైకి వచ్చిన నాన్నారికి తన కొడుక్కి సర్వం సమకూర్చాలని ఉండడం సహజమే. కాని ప్రస్తుతం ఆయన కొన్నవన్నీ...కష్టపడి కూడపెట్టుకున్నవే కదా? ప్రతి వస్తువు కోసం తాపత్రయపడితే గాని రాలేదు... అందుకే కాబోలు కొడుకుని దానికి విభిన్నంగా తయారు చేస్తున్నారు! పిల్లాడికి అన్నీ ఉన్నాయి. ఊ అంటే చాలు కొండమీది కోతిని తెచ్చే తండ్రి ఉన్నాడు— జీవితంలో కావలసినవి సంపాదించుకోవడం వాడికి అతి తేలిక — నాన్నగారిని అడిగితే చాలు!.. రానురాను అబ్బాయి మొద్దులా తయారై ఎందుకూ పనికి రాకుండా తయారైతే ఆ బాధ్యత కూడ తండ్రిదే అనక తప్పదు కదా?

■ అందుకే అనడం— పెద్దవాళ్ల గడచిన చిన్నతనంలోని లోపాలు పూరించుకుంటూ కుర్రాళ్ల వర్తమానం క్రమబద్ధం కాకుండా చేయకూడదని. తన చిన్నతనంలో తనకి జరగలేదని యిప్పుడు కుర్రాడి చిన్నతనంలో అవన్నీ సమకూర్చాలని తాపత్రయపడ్డం—ఒకవిధంగా చూస్తే అర్థంలేనిపని. తనకి లేవుకదా అని ఇప్పుడు కుర్రాడికి లేకుండా చేయడం ఎంత అన్యాయమో— ఇదీ అంతేకదా?

రోజులు మారుతాయి. మన పెద్దల కాలంలో లేనివి, చేయనివి ఇప్పుడు పిల్లలు ఎన్నో చేస్తున్నారు... 'నేను నీ వయస్సులో ఉన్నప్పుడు' అంటూ ఇప్పటి కుర్రకారుకి నచ్చచెప్పచూడడం శుద్ధదండుగ. వాళ్లే అడుగుతారు— 'అప్పుడూ ఇప్పుడూ ఒకటేనా?' అని! నిజమే మరి—అమ్మకాలంలో ఆడపిల్లలకి చదువుల్లేవు అంతమాత్రం చేత 'నాకు మంచి అయితే నీకుమటుకు మంచికాదా?' అని ఈ రోజుల్లో అక్షరం ముక్క రాకుండా ఆడపిల్లని కూర్చోపెట్టవచ్చునా? అన్యాయం. ఒచ్చిన చిక్కే అక్కడ. 'మాకు సంబంధించినంత వరకూ మీ చిన్నతనం పాత పురాణం' అని పిల్లలు ఏదో సందర్భంలో అనే దాకా తల్లితండ్రులు ఊరుకోరు. ఈ రోజున వాళ్లకి ఏదైనా 'కూడదు' అని చెప్తే దానికి కారణం వర్తమానానికి చెందినదై ఉండాలే కాని 'నా చిన్న తనంలో ఇలాగ' అన్నది కాకూడదు. ఎలాగూ మీ చిన్నతనం వాళ్లకి పాతకాలపు కథే కదా!

మన మధ్య పెరుగుతున్న కుర్రవాళ్లకి ముందు చూపే ఎక్కువ ఉంటుంది. అంచేత మనం అనుభవించలేదు కదా అని భూతకాలపు అనుభూతులు వర్తమానంలోకి చొప్పించాలని చూడ్డం హాస్యాస్పదం. అది పాత ఫొటో ఆల్బమ్‌లో పాతకాలపు ఫొటోలు చూస్తున్నట్టుంటుంది వాళ్లకి. ఆ పొడుగు చేతులు, ఉంగరాల వేళ్లు కనబడేలా పోజులూ — అన్నీ చచ్చేటంత నవ్వు పుట్టిస్తాయేకాని వాళ్లకింకోలా ఆసక్తి కల్గించవు. అంచేత అయ్యో మనకి ఎలాగా లేదు — పిల్లలకేనా కోర్కెలు తీర్చాలి అన్న దృక్పథం అర్థం లేనిది. పిల్లల కెలాంటి జీవితం ఈ రోజున కావాలో అదే సమకూర్చడం—విధి లేకుంటే ఏనాడూ కుక్క కరిస్తే చుట్టు కాళ్లు వేయాలనడంలా ఉంటుంది. ●



# దృష్టిదోషం

జొన్నలగడ్డ రాజగోపాలరావు



‘ఇతను ప్రకాశరావని — కెమిస్ట్రీలో రీసెర్చి చేస్తున్నాడు—ఈమె నాభార్య సుశీల!’ భాస్కరశర్మ తనభార్యను ప్రకాశరావుకి పరిచయంచేశాడు.

ప్రకాశరావొకసారి తలవంచుకుని అడిగాడు ‘మీ శ్రీమతి బాగా చదువుకున్నట్లు చెప్పినట్లు జ్ఞాపకం!’

‘ఆఁ బీయస్సీ ఫస్టుక్లాసులో ప్యాసయింది’ — భాస్కరశర్మ గర్వంగా అన్నాడు. ప్రకాశరావు తలఎత్తి మళ్లీ ఒకసారి సుశీలవంక చూశాడు.—

ఆకుపచ్చని టెరిలిన్ చీర, ఆదేరంగు బ్లవుజులో—పచ్చని శరీరంగల అందమైన సుశీల మెరిసిపోతోంది. చదువు ఆమెకిచ్చిన సంస్కారమూ, దేవుడు ఆమెకిచ్చిన అందమూ—ఆమెనవ్వులో ప్రతిఫలిస్తున్నాయి.

‘వెరీగ్లాడ్ టుమీట్ యూ’ అన్నాడు ప్రకాశరావు. ఏదో గుర్తుకు వచ్చినట్లు ‘దిసేవ్-విత్ మీ’ అంది సుశీల. ఆమెమాటలు చాలా మధురంగా ఉన్నాయి. మరో రెండు నిముషాలసేపు మాటలయ్యాక — ‘మరి ఉంటాం!’ అన్నాడు భాస్కరశర్మ.

‘రేపు వచ్చేఆదివారం మాఇంటికి రావడం మాత్రం మరిచిపోకూడదుస్మీ!’ ప్రకాశరావు జ్ఞాపకంచేశాడు. తలఊపి భాస్కరశర్మ కదిలాడు. అతనితోపాటే సుశీలకూడా కదిలింది. ఆమె నడకలో గొప్ప అందం ఉంది.

కాస్త చదువుకుని మంచి సంస్కారం ఉన్నవాళ్ళందరూ అందమైన అమ్మాయిలను వివాహం చేసుకుని సుఖపడుతున్నారు. ఎటొచ్చీ తనే...

సుశీల వేసుకున్న బట్టల్లో వసుంధరను ఊహించుకుంటే? ప్రకాశరావు మనస్సు

బాధగామారింది. అతని మనస్సులో సుశీల చిత్రం ఒకసారి కదిలింది. ఒకవిధమైన అసంతృప్తితో అతను నిట్టూర్చాడు. తనను గురించే ఆలోచిస్తూ అతను ఇంటికి బయల్దేరాడు.

ప్రకాశరావులో చాలామంచి గుణాలున్నాయి. తన బాధ్యతలను గుర్తించి చిన్నప్పటినుంచీ జాగ్రత్తగా చదువుకున్నాడతను. పెద్దవాళ్లను ఏవిషయంలోనూ వ్యతిరేకించడు. అనవసరంగా ఇతరులను నొప్పించడు.

తనమంచి గుణాలవల్ల అతనెప్పుడూ నష్టపోలేదు. మంచివాడనీ, తెలివైనవాడనీ ఇంటా బయటాకూడా పేరు సంపాదించుకున్నాడు. ఎటొచ్చీ పెళ్లి విషయంలోనే అతని మంచితనం అతన్ని వేధించింది.

కొడుకు తనమాట కాదనడనే నమ్మకం కొద్దీ—వసుంధర సంబంధాన్నికుదిర్చారు సుబ్బారావుగారు. ఆయన ఆసంబంధాన్ని కుదర్చడానికి మరో ముఖ్యకారణముంది. వసుంధరతల్లి అరుణ, సుబ్బారావుగారికి వరుసకు చెల్లెలవుతుంది. కానీ సుబ్బారావుగారికి అరుణమీద స్వంతచెల్లెలిమీద కంటే కూడా అనురాగం ఎక్కువ. దానికి కారణాలేమైనా ప్రస్తుతానికి అవి అప్రస్తుతం! వసుంధర పదమూడోఏటే అరుణ చనిపోయింది. చనిపోతూ సుబ్బారావుగారి దగ్గర మాటతీసుకుంది—వసుంధరను సుబ్బారావుగారు కోడలిగా చేసుకోవాలని.

ప్రకాశరావుకి పెళ్లి విషయంలో విపరీతమైన కోర్కెలేమీలేవు. పెద్దలు నిశ్చయించుకున్న పెళ్లే చేసుకోవాలని అతని ఉద్దేశ్యమూకూడా—కానయితే అమ్మాయి కొస్త అందంగాఉండి స్కూలుఫైనలు వరకయినా చదువుకునిఉంటే బాగుండునని అతని ఉద్దేశ్యం. అయితే తండ్రి అతని వద్ద పెళ్లిప్రసక్తి తీసుకువచ్చినప్పుడు మాత్రం అతను తన కనీసపు అభిప్రాయాలనుకూడా వెలిబుచ్చలేదు. అంతా మీ ఇష్టం!' అనేశాడు.

# దృష్టిదోషం

అయితే—తనుచేసిన పొరబాటు అతను పెళ్లిచూపుల్లో గుర్తించాడు. వసుంధర ధర్డుఫారంకంటే ఎక్కువ చదువుకోలేదని అతనికి చూడ్డానికి వెళ్లేముందే తెలుసును. కానీ—ఆమె మరీ అంత అనాకారి కాకపోయినా అట్టే బాగుండదని—అతనికి ఆమెను చూశాకే తెలిసింది. నిజం చెప్పాలంటే ఆమె అతనికి నచ్చలేదు.

అయితే అవి లాంఛన ప్రాయంగా ఏర్పాటుచేసిన పెళ్లిచూపులు తప్ప మరేమీ కాదు. ప్రకాశరావు అంగీకారానంగీకారాలతో నిమిత్తం లేకుండానే పెళ్లి నిశ్చయమైపోయింది.

పెళ్లిచూపులు కాగానే—ప్రకాశరావు తండ్రితో చెప్పాలనుకున్నాడు. కానీ, అతనిలోని 'మంచివాడు ననిపించుకోవాలనేకాంక్ష' అతన్ని ఆపింది. తను ఒక ఆదర్శభర్తను కాగలనన్న నమ్మకం అతనికి ఉంది. తన వంటి వారందరూ అందమైన అమ్మాయిలను వివాహం చేసుకోవాలంటే—వసుంధర వంటి అమ్మాయిలగతి ఏం కావాలి? పైగా వసుంధర తల్లిలేనిపిల్ల...ఆమెను వివాహం చేసుకోడంలో ఏదో త్యాగం చేస్తున్న అనుభూతి గోచరించిందతనికి.

తను నిజంగా త్యాగమే చేస్తున్నాడో, లేక తండ్రిమాట కాదనలేక త్యాగంగా సరిపెట్టుకుంటున్నాడో అతను ఆలోచించలేదు. ఏదే మయితేనేం అతనికి వసుంధరతో వివాహం జరిగిపోయింది.

వసుంధర కాపురానికి వచ్చినప్పట్నుంచీ ప్రకాశరావు తనలో తనే మథనపడసాగాడు. నిజానికి తనవంటి యోగ్యుడికి వసుంధర తగదనీ ఆసంగతి ఆమె మనస్సులో ఉండాలనీ అతనికుండేది. ఆమెకంటే తను ఏదో ఉన్నతస్థాయిలో ఉన్నట్లు—ఆమె తన్ను ఆరాధించాలనీ అతనికి అనిపిస్తూండేది. కానీ తన అభిప్రాయాలనెప్పుడూ అతను ఆమెముందు వెలిబుచ్చలేదు. తన మనసులోని మాటలను పొరబాటున కూడా వెలికి రానీకుండా— ఆమెమీద ఎంతో ప్రేమను కనపరుస్తూండే వాడతను.

వసుంధర మాత్రం ఒక సాధారణమైన భార్యగా వ్యవహరించేది. ఆమె తనూ భర్తతో సమానమని అనుకునేదిగానీ—ఎప్పుడూ అతన్ని ఉన్నతుడిగా భావించలేదు. భావించాలని ఆమెకు తెలియదు కూడా. మంచిమాటలతో అప్పుడప్పుడు అతన్ని మురిపించేది—ఒకొక్కప్పుడు అతనిమీద అలుగుతూండేది కూడా. ప్రకాశరావు తన్ను పెండ్లిచేసుకుని ఏదో త్యాగం చేశాడన్న విషయాన్ని ఆమె చూచాయగాకూడా గ్రహించినట్లులేదు.

ఇదే విషయం అతన్ని బాధిస్తూండేది. తను కావాలనుకుంటే బాగా చదువుకున్న అందమైన అమ్మాయినే వివాహం చేసుకుని ఉండేవాడు. అయినా తను వసుంధరనే వివాహం చేసుకున్నాడు. కానీ ఆమె ఎన్నడూ ఆ విషయాన్ని తనవద్ద ప్రస్తావించదేం? తనతో సమాన మన్నట్లుగా మాట్లాడుతుందేం? అప్పటికీ ఓసారి మాటల సందర్భంలో—'నేను ఎమ్మెస్సీ ప్యాసయ్యాను తెలుసా?' అన్నాడు సరదాగా అన్నట్లుగా. అందుకు వసుంధర నవ్వేసి—



'నాకు మాత్రమేం తక్కువ? మావారూ ఎమ్మెస్సీ ప్యాసయ్యారు!' అనేసింది. అప్పుడతనికి వాదించాలని పించలేదు—వసుంధరను ఆప్యాయంగా దగ్గరకు తీసుకున్నాడు.

ఎవరో ప్రకాశరావు భుజం తట్టారు. ప్రకాశరావు ఉలిక్కిపడి అటుచూసి—'ఓ— రాజారావా? ఎవరో అనుకున్నాను'— అన్నాడు.

'అదేమిటోయ్ అలా పరధ్యానంగా పోతున్నావ్ సరదాగా బీచికి వెడదాం, వస్తావేమిటి?' అన్నాడు రాజారావు.

'వస్తా—పద!'

ఇద్దరూ బీచికి బయల్దేరారు. రాజారావు ఏమేమిటో చెబుతూంటె ఊ కొడుతున్నాడన్నమాటే గానీ ప్రకాశరావు ఇంకా ఆలోచిస్తూనే ఉన్నాడు.

కాపురం పెట్టి ఏడాది దాటినా—తను వసుంధరను బీచికి ఒకటి రెండు సార్లకు మించి తీసుకు వెళ్లలేదు. ఆమె ఎన్నో సార్లు—వెడదామని అడిగేది కానీ — ఏదో కుంటిసాకు చెప్పి తప్పించుకుంటూండేవాడు. ఆమెతో బీచికి వెళ్లడాని కతనికెంతో సిగ్గుగా ఉండేది. అందరూ తనవంకే చూస్తున్నట్టూ, తనభార్య అందంగా లేదని పరిహాసిస్తున్నట్టూ అనిపించేదతనికి. తమ ఒక్కజంటా తప్ప—బీచివద్ద కనిపించే ప్రతి జంటాకూడ చక్కగా అమరినట్లు అనుకునే వాడతను.

బీచికి రాకపోడానికి కారణం ఇది అని అతనెప్పుడూ వసుంధరకు చెప్పలేదు. తన అసంతృప్తిని పైకి వెలిబుచ్చి—ఇతరులను కష్టపెట్టడం అతనికెప్పుడూ అలవాటు లేదు. అలా తనలో తనే మథనపడుతూంటాడు.

'చూడవోయ్— ఈ వేళ బీచికి ఎన్ని జంట లొచ్చాయో— నేనూ మా శ్రీమతిని తీసుకురావల్సింది—' రాజారావు నిట్టూర్చాడు.

ప్రకాశరావు ఆలోచనల్లోంచి తేరుకుని పరిసరాలను పరికించాడు. ఎదురుగా నీలి రంగుతో సముద్రం కనిపించింది. తరువాత విరుచుకుపడే కెరటాలూ, సముద్రపుటొడ్డున ఎన్నో జంటలూ అతని కళ్లబడ్డాయి. అటూ ఇటూ చూస్తూన్న అతనికళ్లు ఒక జంటమీద పడి ఆగిపోయాయి.

అతనికి బహుశా ముప్పైయ్యేళ్లుండవచ్చు—బట్టతల! మనిషి కొంచెం లావుగా ఉన్నాడు ఇన్‌షర్ట్ వేశాడు. అతని భార్యే మరీతమాషాగా ఉంది. పొట్టిగా, లావుగా—పొడుగాటి ముక్కుతో—ఇవన్నీ చాలవన్నట్లు ఇద్దరూ కూడా నల్లద్దాల కళ్లజోడు పెట్టారు. సముద్రం కేసి చూపిస్తూ ఆవిడ ఏదో చెబుతూంటే భర్త—సముద్రపు హోరునిమించి వినిపించేలా నవ్వుతున్నాడు.

ప్రకాశరావు వాళ్లని రాజారావుకి చూపించి—

'చూడురాజా— వాళ్ల మొహానికి బీచి ఎందుకు చెప్పు—నలుగురూ నవ్వుకువేందుకు కాకపోతే—' అన్నాడు.

ఈ వ్యాఖ్యానికి రాజారావు ముఖం గంభీరంగా మారిపోయింది. అతను అదోలా ప్రకాశరావు వంకచూసి అన్నాడు—'వాళ్లు బహుశా బీచిని చూసి ఆనందించడానికి వచ్చారనుకుంటాను — నలుగురికీ ఆనందాన్నివ్వడానికి వచ్చి ఉండరు!'

రాజారావు వ్యంగ్యంగా మాట్లాడేడని గ్రహించేక ప్రకాశరావుకి తన మాటల్లోని పొరబాటు అర్థమయింది— 'బీచికి వచ్చేది ఎందుకు? అక్కడి వాతావరణంలోని సౌందర్యాన్ని ఆనందంగా అనుభవించడానికేగా. అంతేకాని అక్కడికి వచ్చేవాళ్లను ఆకర్షిద్దామని కాదుగదా—'

ఒకవేళ తన మనస్తత్వం విచిత్రమైనదేమో ననుకున్నాడు. ప్రకాశరావు ఏ విషయమూ పూర్తిగా ఒప్పుకోలేడు. మరి, కేవలమూ తమ ఆనందం కోసమే అయితే— బీచికి వచ్చేటప్పుడు అందంగా అలంకరించుకుని, ఆకర్షణీయంగా తయారై రావడ మెందుకు?

అసలు మానవుడిలో ఒక లోపముంది. ఎప్పుడూ ఎదుటి వాడికన్న తను అధికుడి ననిపించుకోవాలని అనుకోవడం. ఖరీదైన బట్టలు వేసుకోవడమూ, కార్లలో తిరగడమూ—ఒక విధంగా తమ ఆధిక్యతను నిరూపించుకోడానికి చేసే ప్రయత్నాలే ఏమో—అదంతా ఎందుకు! కామేశ్వరరావు ఎంబాసిడర్ బూట్ కొన్నాడనేగదా— తమూ ఆ బూటు కొన్నాడు —

**అభియోగాలలో వింతలు!**

## పక్కలో పరాయి పురుషుని ఎరగని పడతి

తన భార్య మరో మగ వాడితో పడకలో ఉన్నదని ఒకభర్త చూచాడు. ఆ పరపురుషుడు పక్కలో వున్న సంగతి తనకు తెలియదని విడాకుల న్యాయస్థానంలో ఆ సతి వాదించినది.

ఆమె మాటలన్నీ శుద్ధ అబద్ధమని న్యాయమూర్తి అన్నాడు. అయితే ఆమె పరపురుషుని సాంగత్య నేరం చేసినదని న్యాయమూర్తి కెయిరేన్స్ నిర్ణయించలేదు. పర పురుషుని పక్కలో శ్రీమతి మార్గరెట్ పియారల్ పడుకున్నదనే విషయము గురించి తగాదా యేమీ లేదంటూ న్యాయమూర్తి ఇట్లా చెప్పారు. తాగిన కైపులో ఇద్దరూ ఒకపడక మీదికి చేరినట్లు వీరిద్దరూ అంగీకరించారు.

'మోటు'గా మేల్కొలిపే వరకూ అదే పక్కలో మరొక జీవి ఉన్న సంగతి వీరిద్దరిలో ఏవరికీ తెలియదు. ప్రేమాయణం సాగించాలనే అనుకుని వుంటారు. కానీ అంత వ్యవధి లేకపోయినది.

'తను వ్యభిచారం చేసిన నేరాన్ని ఇంతకుముందు ఒక అభియోగంలో శ్రీమతి పియారల్ తనంతటతాను అంగీకరించి వున్నది. ఇప్పుడు అలా అంగీకరించకుండా, నేరం చేయలేదని ఆమె అనడానికి, తగినంత కారణం కనిపించదు

'తన భార్య పర పురుషునితో ప్రేమాయణం సాగించినదని శ్రీ పీటర్ పియారల్ వాదించివుంటే —అతనివాదనను అంగీకరించే తీర్పు లభించివుండేదే

కానీ ఈ అభియోగంలో శ్రీమతి పియారల్ కు అనుకూలంగానే తీర్పు లభించినది. నిర్దాక్షిణ్యంగా తనను భర్త హింసించాడని ఆమె ఆరోపణ!

—వి. యస్. అవధాని ●

ఆకర్షణీయంగా తయారై రావడానికి ఇదే కారణమేమో—కానీ, ఆకర్షణీయంగా లేమేమోనన్నభయంతో బయటకు రాక పోవడం ఎంతవరకు సబబుగా ఉంటుంది?

అందరి విషయంలో ఎలా ఉన్నా తన విషయంలో ఆ ప్రభావం కొంత వరకూ ఉంది. వసుంధరను నలుగురిలోకి తన భార్యగా తీసుకురాలేక పోతున్నాడంటే—ఆమె ఆకర్షణీయంగా లేదనేకద! అయితే ఆమెను తను వివాహ మెందుకు చేసుకున్నట్లు?

అందరిలాగే ఆమెకూ భర్తతో సరదాగా తిరగాలనే కోరిక ఉంటుంది. ఆకర్షణీయంగా నలుగురికి కనిపించదనే కారణంతో ఆమెను ఆకోరికకు దూరం చేశాడతను. తనకంతగా కోరిక ఉన్నప్పుడు—నచ్చిన అమ్మాయినే వివాహం చేసుకుని ఉండవలసింది. వివాహం చేసుకుని అసంతృప్తిపడడంలో అర్థముందా?

ఇంతవరకూ ఆలోచించేక ప్రకాశరావు మనస్సుకి ఒకటే సమాధానం చెప్పుకున్నాడు. నేనామెను కష్టపెట్టడంలేదు. ఆమె అంటే ఇష్టంలేదని ఎప్పుడూ పైకి అనలేదు. వేళాకోళానికి కూడా నా అసంతృప్తిని బయట పెట్టలేదు. ఎంతో ప్రేమగా చూసుకుంటున్నాను!'

సుమారు ఒకగంటసేపు బీచివద్ద గడిపేక ప్రకాశరావూ, రాజారావూ ఇళ్లదారి పట్టారు.

ఇల్లు సమీపిస్తూంటే అతనికి మనస్సులో సుశీల మెదలసాగింది. చక్కని ఉచ్చారణ, తియ్యని కంఠస్వరం—సొగసైన నడక—అందమైన శరీరం...వీటిల్లో వసుంధరకు ఒక్కటైనా ఉంటే...

నిజంగా వసుంధరలో లోపాలున్నాయో, తన అసంతృప్తే ఆమెలో లోపాలు చూపిస్తోందో—అతను ఆలోచించడానికి ప్రయత్నించలేదు

'వసూ!' అతను తలుపు తట్టాడు. ఆమె వచ్చి తలుపు తీసింది. వంటచేస్తూ చేస్తూ మధ్యలో వచ్చిందేమో — ముఖమంతా అదోలా ఉంది. చేతులు కూడా శుభ్రంగా లేవు.

'చాలా పెందరాళేవచ్చారే—' ఆమె వెటకారంగా అతనివంక చూసినవ్వింది—'ఆ నవ్వులో ఆకర్షణ లేదు'—అనుకున్నాడు

# దృష్టిదోషం

ప్రకాశరావు. సుశీలయితే...

వసుంధర వెనక్కి తిరిగి వెళ్లిపోయింది—'ఆ నడకలో సొగసు లేదు—' అనుకున్నాడు ప్రకాశరావు.

తెలివైన ఏ భార్య అయినా భర్త ఇంటికి వచ్చేసరికి—చక్కగా అలంకరించుకుని—ఎలా కనిపించాలి! ఇంటికి రాగానే ఇలాంటి ముఖం కనిపిస్తే—మగాడికి ఇంటికి రాబుద్ధేస్తుందా?

పాపం—నాలుగు గంటలకి వసుంధర చక్కగా అలంకరించుకుని అతనికోసం ఎదురు చూసిందనీ—ఆరు దాటేకనే ఆమె వంటకు పూనుకుందనీ అతనికి తెలియదు కనీసం ఊహించడానికి కూడా అతను ప్రయత్నించలేదు. ఆమె వంటచేయ నవసరంలేని ఏర్పాటు అతను చేసిఉంటే—ఆమె తప్పక రోజల్లా అతనికోసం ఎదురు చూస్తూ ఉండేదేమో?

తనకూ ఇంటికి రావడానికి ఒక టైముందనీ—ఇష్టంవచ్చినప్పుడు వస్తే ఆమెను నిరుత్సాహపరిచిన వాడినవుతాననీ అతనికి అనిపించినట్లు లేదు. అవునుమరి—అతను ఉన్నతుడు, విద్యాధికుడు... అతన్ని భర్తగా పొందడమే వసుంధర అదృష్టం!

ప్రకాశరావు నెమ్మదిగా బట్టలు మార్చుకుని పడకగదిలోకి వెళ్లాడు. అక్కడ మంచంమీద ఒక డైరీ అతన్ని ఆకర్షించింది. తీసి చూశాడు. అది వసుంధర డైరీ!

అతను ఒక్క క్షణం ఆశ్చర్యపోయాడు వసుంధర డైరీ రాస్తూండగా అతనెప్పుడూ చూడలేదు అసలామె డైరీ రాస్తుందని అతనికి తెలియదు అందువల్ల అతనికి కుతూహలం కలిగి నెమ్మదిగా పేజీలు తిప్పసాగాడు.

డైరీ చదువుతూంటే అతనికి ఒక విధమైన ఆశ్చర్యం కలగసాగింది చదువుకోకపోవడంవల్ల వసుంధరకు వ్యక్తిత్వం ఉన్నదని అత నెప్పుడూ అనుకోలేదు. ఆమెకూ కోరికలుంటాయనీ, ప్రత్యేకమైన ఆలోచనలుంటాయనీ ఆ డైరీ చదువుతూంటె అతనికి అర్థమవసాగింది. అందులో ఓ పేజీ అతన్ని ఆకర్షించింది.

'డాక్టర్ని పెళ్లిచేసుకోవాలని నా కెంతో కోరిక—నాన్నగారిదగ్గర సిగ్గుపడి ఎప్పుడూ చెప్పలేకపోయాను. నా భర్తవల్ల ఎంతోమంది ప్రాణాపాయాలనుంచి తప్పించుకుని—కృతజ్ఞతలు చెప్పుకోడానికి మా ఇంటికి వస్తూ—డాక్టరు భార్యగా నన్ను గౌరవించినప్పుడు—అదొక వింత అనుభవం—డాక్టర్లకు భార్యతో కులాసాగా గడపడానికి తీరుబడి ఉండదనీ—డాక్టర్నెప్పుడూ పెళ్లి చేసుకోకూడదనీ నళిని అంటూండేది. ఇప్పుడు ఈయన మాత్రం—డాక్టరు కాకపోయినా తీరుబడి ఏముంది? సరదాగా బీచికైనా తీసుకెళ్లరు—ఏవో ఇంట్లో కబుర్లు చెప్పడమే తప్ప!'

ప్రకాశరావు తరువాతి పేజీ తిప్పాడు. మర్నాటి డైరీలో కూడా ఆ విషయం గురించే రాసిఉంది. 'అసలు నేను డాక్టర్నే చేసుకుంటాననీ—వారిని చేసుకోననీ నాన్నకు చెప్పిఉండవలసింది. నా భర్త డాక్టరు కాదే అన్న అసంతృప్తి నన్ను బాధిస్తోంది. —కానీ వారు కూడా మందులివ్వకపోయినా ఒక ఏడాదిలో ఏదో డాక్టరు అవుతారట!'

మర్నాటి డైరీలో — 'పాపం—ఆయన్ను చూస్తే జాలేస్తోంది. చాలా అమాయకులు. నన్నెంతో గాఢంగా ప్రేమిస్తున్నారు. అప్పుడప్పుడు నాలో కలిగే ఆలోచనలు వారికి తెలిస్తే ఎంత బాధపడతారో? మనస్సు స్థిరమైనది కాకపోవడం మూలాన వెధవ ఆలోచనలు వస్తాయి కానీ—లేకపోతే నాకు ఆయనమీద ప్రేమలేదనా?' అని రాసి ఉంది.

డైరీ మూసేసి ఆ మంచంమీదనే పెట్టేసి మళ్లీ డ్రాయింగురూమ్‌లోకి



వచ్చేశాడు ప్రకాశరావు. ముందతనికి విపరీతమైన ఆవేశం కలిగింది—కానీ అది ఒక్క క్షణంలోనే చల్లారిపోయింది.

వసుంధర పొరబాటున ఆ డైరీని మంచంమీద మరిచిపోయింది కానీ—అది తన కళ్ళ పడాలసిందికాదు. కానీ ఆ డైరీ తనకు కళ్ళు తెరిపించిందని అతను గ్రహించాడు.

ఎప్పుడూ వసుంధర తనకు తగ్గదవునో కాదో అని ఆలోచించాడే తప్ప—ఆమె దృష్టిలో తన స్థానాన్ని ఊహించుకోలేదు తను. తన దృష్టిలో తనెలా ఉన్నతుడో—ఆమె దృష్టిలో ఆమెకూడా ఉన్నతురాలే—అంతేకానీ, ఎవరూ తనను గురించి తక్కువగా ఊహించుకోరు.

నిజానికి తనూ పెద్ద అందగాడేమీ కాదు, పెర్సనాలటీ కూడా గొప్పది కాదు. తనకంటే అందంగా, ఆకర్షణీయంగా కనబడే మగవాళ్ళు బోలెడుమందున్నారు—వాళ్ళతో తన్ను పోల్చుకుని వసుంధర కూడా అసంతృప్తి చెందడం ప్రారంభిస్తే .....

ఇన్నాళ్ళకు ప్రకాశరావు సరిగ్గా ఆత్మ విమర్శ చేసుకోగలిగాడు. ఇన్నాళ్ళా అతని దృష్టిలో వ్యక్తిత్వంలేని వసుంధరకు—ఆ క్షణంలో వ్యక్తిత్వం వచ్చి అతని దృష్టి దోషాన్ని పోగొట్టింది. ఇన్నాళ్ళా తనెంత పొరబాటుగా వర్తించాడో అతని కర్థమయింది.

'వసూ!' అతను గట్టిగా పిలిచాడు.

'వస్తున్నానండీ!'

తియ్యని మాట వినిపించిందతనికి. మరుక్షణంలోనే మెరుపులా వచ్చింది వసుంధర. కాంతికంటె శబ్దమే ముందు ప్రయాణిస్తోంది కాబోలు—అనుకున్నాడు ప్రకాశరావు ఆమెవంక చూస్తూ.

భర్త తనవంక అదోలా చూడడం చూసి సిగ్గుపడుతూ—'అదేమిటండీ, అలా చూస్తున్నారు—పిలిచారు కదూ...?' అంది వసుంధర.

కానీ ఎందుకు పిలిచాడో ప్రకాశరావుకీ తెలియదు. అతను ఇంకా ఆమెవంకే చూస్తూ—'నా దృష్టిలో ఏదో దోషముంది—లేకపోతే ఇంత అందమైన భార్యను ఎలా నిర్లక్ష్యం చేయగలిగాను!' అని మాత్రం అనుకున్నాడు... ●



# రెండురకాల వంటలు

ఓ గంట ముందు అనుకొని ఎప్పటికప్పుడు చేయటానికి సులభంగా వుండే రెండురకాల పిండివంటలు చెబుతాను. ఇవి రెండుబొంబాయి రవతోనే చేయాలి. తినటానికి కరకరలాడుతూ చాలారుచిగాఉంటాయి.

## తీపి కజ్జికాయలు

ఒక కప్పు రవ తీసుకొని చిటికెడు ఉప్పు, రెండు టీస్పూనులనెయ్యి, కొద్దిగ సోడాపొడి వేసి పూరీపిండిలాగ కలుపుకోవాలి. కజ్జికాయల లోపల వేయటానికి ఒక కప్పు చక్కెర (దంప నవసరంలేదు), అరకప్పు బొంబాయిరవ (వేపాలి), చటాకులో సగం గసగసాలు, కొద్దిగా వేపిన శనగపప్పు (పప్పులు), సగం చిప్ప ఎండు కొబ్బెర (తురుముకోవాలి), జీడిపప్పు, సారపప్పు, ఎండుద్రాక్ష, ఏలకుపొడి అంతా కలుపుకొని ఒక గిన్నెలో వుంచుకోవాలి.

కలిపి వుంచుకొన్న రవను ఓ గంట నాననిచ్చి, రోట్లోవేసి కొద్దికొద్దిగ నీరు జల్లుతూ మెత్తగా ఒక 10 నిమిషాలు దంపాలి. అప్పుడే పిండిని పట్టుకు లాగితే సాగుతుంది. కొద్దిగ నూనెవేసి దంపుకొని దీనిని తీసి, చిన్న చిన్న వుండలుగా చేసుకొని పూరీలలాగ వత్తుకోవాలి. ప్రతిపూరీ అంచు చుట్టూ కొద్దిగా నీరు రాసి, చక్కెర పొడిని తగినంత వేసుకొని పూరీ కొనలు అతకాలి. నీటితడి వుంటుంది కాబట్టి పూరీ విచ్చుకోక గట్టిగ వుంటుంది. దీనిని నూనెలోగాని, నెయ్యిలోగాని, డాల్డాలోగాని వేసి బాగా కరకరమనేలా వేపాలి. తినటానికి బాగుంటాయి. వేడిమీద తింటే మా చెడ్డ రుచిగా వుంటుంది సుమండీ. చక్కెరపొడి మిగిలినా, పిండి మిగిలినా అట్టే బాధ వుండదు. పిండి మిగిలితే పూరీలు చేసుకోవచ్చు. చక్కెరపొడి మిగిలితే కాస్త కరిగిన నెయ్యిగాని, పాలుగాని వేసి లడ్డులాగ వుండ కట్టి తినవచ్చు. బాగుంటుంది కూడాను.

## కారం కజ్జికాయలు

దీనికి కూడ ఒక కప్పు బొంబాయి రవ తీసుకొని తీపివానివి కలిపినట్లుగ కలుపుకొని వుంచుకోవాలి.

ఒక కప్పు శనగపప్పు, 4, 5 పెద్ద బంగాళాదుంపలు (రెండు ముక్కలుగ చేసుకోవాలి) నీరు వేసి వుడకనివ్వాలి. పప్పు చితికేదాక వుడకనివ్వక దింపుకొని, నీరంతా వోడనివ్వాలి. బంగాళాదుంపలను తొక్కు తీసుకొని చిన్న చిన్న ముక్కలుగ చేసుకొని పప్పులో కలపాలి. పప్పు వుడికేలోగా కావలసిన మసాలాకారం దంపుకోవాలి. మసాలాకు వేయవలసినవి: ఎండుకొబ్బెరముక్కలు చిన్న చిన్నవి పచ్చిమిరపకాయలు, ఉప్పు, అల్లంముక్క, జీలకర, వెల్లుల్లి 4, 5 పాయలు. ఇవన్నీ మెత్తగ దంపుకోవాలి. రెండు వుల్లిగడ్డలను సన్నగ తరుక్కొని, పోపులో వేసి కరివేపాకు, కొతిమ్మెర ఆకు వేసి, మసాలాకారం వేసి బాగా కలిపి పప్పు, బంగాళాదుంప ముక్కలువేసి 2, 3, నిమిషాలు బాగా కలియబెట్టి కూరలాగ చేసుకొని ఒక గిన్నెలో వుంచుకోవాలి.

తీపి కజ్జికాయలాగే రవను దంపుకొని కజ్జికాయల పొట్టలో ఈ కూరను వేసి నింపాలి. వీటిని కూడ బాగా కరకరమనేలా వేపి తీయాలి. ఇవి కూడ చాలా చాలా బాగుంటాయి, వేడిమీదనయితే మరి చెప్పనక్కరలేదు.

సాయంత్రం కాఫీకి ముందు తలా రెండు తీపి, కారం కజ్జికాయలు యిస్తే బాగుంటుంది. ఎంత కావాలో అంతే చేసుకొంటె శ్రమ తప్పటమే కాకుండా, దుబారా కూడ తప్పుతుంది. వంటలో అనుభవం లేని వారుకూడ దీన్ని చేయవచ్చు. చేయటంలో కష్టం, నాజూకూ లేని పని కాబట్టి ఎటువంటి వారయినా ప్రయత్నించవచ్చు.

—మంగళా కందూర్. ●

# వేసవిలో మల్లెలు

వేసవిలో మల్లెలు విరగబూస్తాయి. అసలు మల్లెలకు వేసవే ముఖ్యమైన కాలము. జాజులూ, విరజాజులూ కూడా వేసవిలోనే పూస్తాయి. మిగతా కాలాల్లో చూడాలన్నా కన్పించవీ మల్లె, జాజులు. కాస్త ఖాళీ స్థలముంటే ఏ పూలమొక్కో వేయడము ఈ రోజుల్లో ముఖ్యమైపోయింది అందునా కరువు రోజుల్లో డబ్బుపెట్టి ఏ పూలను కొనగలము చెప్పండి? కొనే వాళ్ళకూడా వున్నారనుకోండి. మధ్య తరగతి కుటుంబాల వాళ్ళకు డబ్బుపెట్టి పూలను కొనాలంటే కష్టంగానే వుంటుంది మరి.

ఇంటిలో ఏదో మూల ఖాళీ స్థలమంటూ వుండక పోదు సాయం సమయాలలో ఆ మొక్కల వద్ద కూర్చుని సేవచేస్తే ఎంత ఆనందంగా వుంటుంది మనస్సుకి. నాకైతే ఎప్పుడూ ఆ మొక్కలతోనే గడపా లన్పిస్తుంది. ప్రశాంతంగా వుండి మనస్సు కుత్సాహమొస్తుంది కూడా

మల్లెలలో చాలా రకాలున్నాయి కదా! తుప్ప మల్లె, దొంతరమల్లె, పందిరిమల్లె, బొడ్డుమల్లె, లా చాలారకాలు

తుప్పమల్లెలు చాలా విరివిగా వుంటాయి. తుప్పలమాదిరి అల్లుకొని వుంటాయి. అందుకేనేమో వాటికాపేరు

దొంతరమల్లె సామాన్యంగా చాలా తక్కువగా వుంటాయి మొక్కలు. ఇది మామూలుగా పందిరి వేసి పెంచాలి. దొంతరమల్లె మొగ్గ సుమారు రెండంగుళాల పొడవున చాలా రేకులతో అందంగా వుంటుంది. పందిరి మల్లె కూడా ఇలాగే దొంతర మల్లెను పోలే వుంటుంది బొడ్డుమల్లె పేరుకు తగ్గట్టుగానే ఎంతో బొద్దుగా, ముద్దుగా, అందంగా వుంటాయి.

అసలు పూలంటే ఇష్టపడని వారెవరు? అందునా ఈ మల్లెలంటే. అసలు పూలపిచ్చి మనకు కాక ఇంకెవరికి? స్త్రీ ఎప్పుడూ కోరేవి పువ్వులేకదా! వస్త్రవులూ, చీరలూ, పువ్వులేకదా స్త్రీకి కావలసినవి. మాలకట్టుకొని మన నల్లటి కురుల మధ్య ఈ తెల్లటి మల్లెల మాలను అలంకరించుకుంటే ఎంత అందంగ వుంటుందో కదూ!

ఇక సన్న జాజుల సంగతి సన్న జాజులు ఎంతో సువాసనలతో వుంటాయి. పందిరంతా మొగ్గలతో, పువ్వులతో ఎంత కళకళలాడుతుందో వేరే చెప్పాలా? ఎన్ని పూలు పెట్టుకున్నా ఇంకా పెట్టుకోవాలనే వుంటాయి ఈ జాజిపూలు. చక్కగా వాలుజడ వేసుకొని పెద్ద మాల పెట్టుకొంటే ఎంతనిండుగా వుంటుందో నిజంగా!

కొని పెట్టుకోవాలంటే వందా, పాతికతోనే తృప్తి పడతారు అదే ఇంట్లో పూచినవి కాబట్టి ఎన్నిపెట్టుకొన్నా అడిగే వాళ్ళుండరు మన సరదా తీరుతుంది. ఇన్ని పూలు పెట్టుకున్నామన్న తృప్తి మనకుంటుంది. ఇంట్లో పూచినది ఒక్క పువ్వు పెట్టుకొన్నా మనకెంతో తృప్తిగా ఆనందంగా వుంటుంది. ఎందుకో తెలుసా? మన చేతులతో పెంచి మొక్క పెరిగి పెద్దదై మనకు ఫలితాన్నిస్తున్నప్పుడు మనకు ఆనందముకాక మరేముంటుంది?

ఎంత తక్కువ ఖాళీ స్థలమున్నా ఒక మల్లె, జాజిల పందిళ్ళు వుంటే అవే కొన్నాళ్ళకు పెరిగి మనకెన్నో మొక్కల్ని ఇస్తాయి అవి వేరుగా అంట్లు కూడా కట్టుకోవచ్చు. ఇంట్లో ఖాళీ స్థలములేని వారు గోతాలలోను, చెక్క పెట్టెలలోను, పెద్ద తొట్లలోను వేసుకున్నా అందంగానే వుంటుంది.

చాలా మందికి మొక్కలను పెంచే విధానము తెలియదు. మల్లె, జాజి వంటి పందిరి మొక్కలకు కనీసము వారానికి ఒక్కసారైనా గొప్పు త్రవ్వి పేడను ( ఎరువు ) వేయడము మంచిది. పేడను ముద్దగా కాకపోయినా చిక్కగా కలిపి వేసినా వేయవచ్చు. వుల్లిపాయల పొట్టు, వెల్లుల్లిపాయల పొట్టు వేస్తే మొక్కలు బలంగా ఏపుగా పెరుగుతాయి. మాంసము, చేపలు తినేవారు అవి కడిగి నీటిని ఈ మొక్కలకు వేయవచ్చు. ఆ మాంసము, చేపల నీరు వీటి కెంతో బలాన్నిస్తుంది. వారం వారంగా విధిగా గొప్పు తవ్వుతూ ( వేసవిలో ) రెండు పూటలా నీళ్ళుపోసి దానికి తగిన ఎరువును వేసుకొని పెంచుకుంటే ఆ మొక్కలు పూచాయంటే పుయ్యావామరి. విరగ బూస్తాయి నిజంగా!

మన పనంతా అయిన తరువాత విశ్రాంతిగా ఆ మొక్కల వద్ద కూర్చుంటే ఎంత హాయిగా వుంటుందో వేరే చెప్పాలా? విరిసీ విరియని ఆ మల్లె, జాజుల పరిమళము మనల్ని ఏవో లోకాలకు తీస్కుపోతుంది. రోజంతా అలసిన మనకు ఆ బడలికే వుండదు సరికదా! నూతనోత్సాహంతో మనస్సు పరవళ్ళు త్రొక్కుతుంది.

—ముప్పన సుజాత.

డాక్టర్ కబుర్లు

## ఎక్స్‌రే చికిత్స ప్రభావాలు

ఎందరో ఎక్స్‌రే చికిత్స పొందుతున్నారు. వ్రణాలకి దానిని ప్రత్యేకంగా వాడుతున్నారు. వక్షంలో, నడుం ప్రాంతంలో



శస్త్ర చికిత్స పొందిన వనితలు ఎక్స్‌రే చికిత్స తప్పకుండా వాడుతూ ఉంటారు.

ఇది బాధా కరమయినది కాదు. కాని, దాని ప్రభావం శ్రేయస్కరమయినది కాదని చాలా మంది భయపడుతూ ఉంటారు. వికారం పుట్టవచ్చునని వారి భయం. కొందరికి కడుపులో నెప్పి, మాంద్యంరావచ్చుననికూడాభయం.

ఈ గుణాలు అందరు రోగులకి కనిపించక పోవచ్చు. కొందరికి ఏ విధమయిన ఇబ్బందీ కాక పోవచ్చు. వచ్చిన వాటికి విరుగుడుకి మందులు ఉన్నాయి.

విచిత్ర మేమిటంటే ఎక్స్‌రే చికిత్స పొందిన కొన్ని నెలలకి ఈ గుణాలు కనిపించ వచ్చు— నడుం వద్దనెప్పి, విరోచనాలు, మల బద్ధకం మొదలయినవి.

ఇవి ఎక్స్‌రేలవల్ల వచ్చే వేనాఅని డాక్టరు పరిశీలించి నిర్ణయించాలి.

హెచ్. ఎల్. హెర్షెన్‌సోన్

(కాపీ రయిటు)

పెద్దకథ

# విముక్తి



## గురుద్యోగపర్వం

వేళ్లపల్లి వెంకటలక్ష్మీనారాయణ

### 4

ముక్తేశ్వర్రావు ప్రారంభోత్సవం చేశాడు.

ఏదన్నా జ్ఞానోపదేశం చేసే ముందు ముక్తేశ్వర్రావు మూలుగుతాడు. కాస్సేపు సకిలిస్తాడు. తర్వాత 'హాఁ' అంటాడు. 'అవును...అదే రివాజు' అంటాడు. యిలాగె యింకా కొన్నంటాడు. అనుకుంటాడు. అవతలివాడు 'ఏం కథ? ... కథేమన్నా చెప్పబోతున్నావా?' అనేవరకూ మూలుగుతూనే వుంటాడు; తల తిప్పుతూనే వుంటాడు. యిప్పుడు కూడా గురుద్యోగి— 'ముక్తేశ్వర్రావ్! ముక్తసరిగా మూడు ముక్కల్లో కథ చెపితేసరే ... కిందటిసారొచ్చినప్పుడు కూడా బోల్డు కథల్చెప్పావ్. యిచ్చినమాట తప్పావ్...ఎందుకొచ్చిన కథలు! ఓ నీతుందా నియమంవుందా' అన్నాడు.

ముక్తేశ్వర్రావందుకుని 'నీతి నియమాలేవిటి? నే నెప్పుడూ కూటికొచ్చే కథలు, గుడ్డ నిచ్చే కథలే చెపుతాను' అన్నాడు. 'యింతకంటె నీతులేవుంటయ్' అన్నాడింకా పైగా.

'సరే, త్వరగా మొదలెట్టి త్వరగా తేల్చు' అన్నాడు గురుద్యోగి. ముక్తేశ్వర్రావు గురుద్యోగొంక చూసి కథ చెప్పటం మొదలెట్టాడు:

'గురుద్యోగీ! నీకు పైవాడ్తో కబుర్లు చెప్పటం రాదు. కథలు వింటం అంతకన్నా రాదు. అందుకే పైవాణ్ణి మంచి చేసుకోలేక తలొంచుకుని పని చేసుకుంటున్నావ్. పైవాడేవన్నా అంటె తల బాదుకుంటున్నావ్. అందుకే నీ బట్టతలట్టా వుంది. ఏవిటా బట్టతలచుట్టూ పిట్టగోడమాదిరి ఎత్తుగావుంది? బొప్పి కట్టిందా? ... తల బాదుకుంటున్నావ్ కదూ?...నేను కిందటిసారొచ్చినప్పుడా వెనకాల నేనంత అధ్వాన్నంగాలేదు. యిప్పుడక్కడకూడా బొప్పి కట్టింది. కట్టకేం చేస్తుంది రోజూ నెత్తిమీద మొట్టుకుంటుంటె? ... అందుకని నీకీ కథ సొంతం చెపుతాను. ముక్తసరిగాకాకుండా నీకు విముక్తిమార్గం దొరికేదాకా చెపుతాను...అట్టా కూర్చో'

'నీపైనున్న ఆఫీసరున్నాడే ... ప్రమోదరావు...వాడు నాకు చిన్నప్పట్నించీ తెల్సు. చిన్నప్పుడు బళ్లో కెళ్లేటప్పుడు మేం వందరం గోడలమీద బొమ్మల్చూస్తూ నడుస్తూపోతుంటే వీడికళ్లెప్పుడూ నేలమీదేవుండేవి. అదివరకెప్పుడో కింద చూస్తూ నడుస్తుంటె డబ్బులో్దొరికినయ్‌ట. డబ్బంటె అతగాడికి బోల్డాపేక్ష. అందుకని అప్పట్నించీ—వాడికి కిందిచూపే. యిప్పుడు పెద్దయ్యి పై పోస్టులోకెళ్లాక్కూడా అతగాడు కింది పీట్ల వేపే చూస్తున్నాడు. కింది పీట్లల్లో ఎంత డబ్బొస్తుందో అతగాడికి బాగా తెల్సు. డబ్బంటె అతగాడికెంతాపేక్షో యీ సంగతి చెబితే నీకే తెల్సిపోతుంది. ప్రమోదరావు పెద్దవాడు. వాళ్లకి పెద్దగా ఆస్తి లేదు. వాళ్ల బజార్లోనే పిల్లల్లేని ఒక మొగుడూ పెళ్లాం వుండేవాళ్లు. వాళ్లకి

బోల్డాస్తి. అది కనిపెట్టిన ప్రమోదరావు ఆ యింటిచుట్టూ తిరిగి, ఆవిణ్ణిచుట్టుకుని, ఆయన్ని పట్టుకున్నాడు. ప్రమోదరావు 'పార్కిన్సన్' కన్నా ఓ మెట్టుపై కెళ్ళినవాడు. పార్కిన్సన్ 'నీ తండ్రిని నువ్వు సెలెక్టు చేసుకోలేవు; కాని నీ మామని నువ్వు సెలక్టు చేసుకోవచ్చు' అన్నాడు. ప్రమోదరావు 'తండ్రినిమాత్రం ఎందుకు సెలక్టు చేసుకోలేం' అని నెల తిరిగేలోగా వాళ్ళింటికి పెంపకాని కెళ్ళిపోయాడు. 'నేను పెంపకానికెడ్తా'నని ప్రమోదరావు పట్టుబట్టి ఏడుస్తుంటె, తండ్రి ఏడుస్తూ—'నాయనా! నువ్వు పెద్దవాడివి. దత్తు యివ్వన్నా' అని ఎత్తుకున్నాడు. ప్రమోదరావు కిందికి దిగి—

'నాన్నా! యిదే నిన్నిట్లా ఆఖరిసారి పిలవటం. నేను పెంపకానికెళ్ళేది ఖాయం. నిన్ను నమ్ముకుంటె మిగిలేది అస్థికలేగా?' వాళ్ళ నమ్ముకుంటె బోల్డాస్తి మిగిల్చిపోతారు' అని సంచీలో గుడ్డలు పెట్టుకుని వాళ్ళింటి కెళ్ళిపోయాడు..

అలాంటి ప్రమోదరావు • డబ్బుకోసం నిన్ను పీడిస్తున్నాడంటె ఆశ్చర్యంలేదు. ప్రమోదరావుకి ప్రమోదం కల్గించావంటె నువ్వేంచేసినా ఆమోదిస్తాడు; ఏం చెయ్యకపోయినా ఆమోదిస్తాడు, ప్రమోషన్లు కూడా యిప్పిస్తాడు అలా కాకపోతే ప్రమోదరావుతో చాలా ప్రమాదం. అదే గుర్తుంచుకో...అయినా నువ్వు మాత్రం యిదేం పని? నీ సీటు బంగారంలాంటి సీటు. ఎంతో పట్టచ్చు; నువ్వింత తిని పైవాడికేగాక నాలాటివాళ్ళకో నలుగురికి పెట్టొచ్చు. అలాంటిది నువ్వు తినవ్; యింకోళ్ళని తిన్నివ్వవ్... అసల్నా అనుమానం నీకీ సీటు మహిమ తెలియదేమోనని. అందుకే గుడ్డివాడిచేతిలో దీపంలా యిట్లావుంది యీ సీటు మహత్యం చెపుతాను విను: పదేళ్ళనాడు పెద్దయ్య యీ సీట్లో రిటైరయ్యాడు. పెద్దబజార్లో మూడంతస్తుల మేడుందే అది యీ సీట్లోకొచ్చాకే కట్టాడు. మార్కండేయులని మొన్ననే రిటైరయ్యాడు. యింకో రెండేళ్ళకి రిటైరవుతాడనగా యీ సీట్లోంచి పై సీట్లోకి ప్రమోషనిచ్చారు. ప్రమోషనొచ్చిందని మార్కండేయు లెగిరి గంతెయ్యలేదు.

# గురుద్యోగ పర్వం

ప్రమోషనార్డర్చూసి తనని చూసి కళ్ళల్లో నిప్పులు పోసుకుని తన నోట్లో దుమ్ముకొట్టారని, తన జేబుకొట్టేశారని వాపోయాడు. వెంటనే మర్రోజు పైకెళ్ళి మరో అయిదొందలు ఖర్చుపెట్టి ప్రమోషనురద్దు చేయించుకొచ్చాడు. అట్లా మార్కండేయులు — రిటైరయ్యేదాకా యీ సీటుని భక్తమార్కండేయుడు శివలింగాన్ని కరుచుకూర్చున్నట్టు కూర్చున్నాడు. ప్రమోషనొచ్చినా ఎందుకొదులుకున్నాడు? పైకెడితే మహా అయితే ఓ వందెక్కువొచ్చేను. కానీ అతగాడికి పెళ్ళి చెయ్యాల్సిన యిద్దరు కూతుళ్ళున్నారు. యీ సీట్లోవుంటె యీ



రెండేళ్ళల్లో వాళ్ళిద్దరికీ మంచి సంబంధాలేవచ్చు అట్లానే తెచ్చాడు కూడాను. లేకపోతే కాళ్ళరిగి పోయేట్టు విరిగిపోయేట్టు తిరగాల్సొచ్చేది సంబంధాల కోసం. కాళ్ళరిగిపోలేదు కాబట్టే యిప్పుడా సెంటర్లో కట్టుకున్న యింట్లో కాలుమీద కాలేసుకూర్చుంటున్నాడు; , వేడుకుంటున్నాడు కూడా...అలాంటి సీట్లో కూర్చుని నువ్వు ప్రమోదరావునిట్లా ఏడిపిస్తుంటె అతగాడికి కోపంరాదూ? అందులోనూ సీటువిలువ తెల్సున్నవాడు; ఎట్టా నిలవగల్డు చెప్పు? ఆపని యిప్పుడతగాడు చెయ్యలేదు గందా మరి? ఎందుకంటె యిప్పుడతగాడి రూంలో కెవ్వడూ వెళ్ళడుగదా? గాలికూడా వెళ్ళటానికి వీల్లేని 'ఎయిర్ కండిషన్డు రూం'లోకూర్చుంటాడుగదా మరి. అయినా యీ సీటు మహిమ తెల్సినవాడు కాబట్టి నువ్విట్లా వేస్టుచేస్తుంటె ఎయిర్ కండిషన్డు గదిలో కూర్చుని కూడా వేడెక్కిపోతున్నాడు. ప్రమోషనొచ్చేముందు ప్రమోదరావీ సీట్లోనే వుండేవాడు. ప్రమోషనొచ్చిపై సీట్లో కెళ్ళేటప్పుడు కిందివాళ్ళు పార్టీయిచ్చి, 'ఓ రెండు ముక్కలు మాట్లాడండి' అన్నారు. 'రెండు కాదు, ఒక్కముక్క కూడా రావటల్లే'దన్నాడు ప్రమోదరావు, అలా అంటనే కాకుండా భోరుమని ఏడ్చాడు. యీ సీట్లన్నిటినీ, మిమ్మల్ని, , ముఖ్యంగా బంగారం లాంటి యీ సీటుని వొదిలి వెళ్ళాలంటె ఏడుపొస్తోందన్నాడు. ఆ సీట్లో ఎన్నో ఏళ్ళుగా వున్నానన్నాడు. ఎన్నోవేలు తిన్నానన్నాడు. యింకెన్నోవేలు తిందామనుకున్నానన్నాడు. కానీ ఏమో, దైవం వకటే తల్చినా పైవాళ్ళు వేరొకటి తల్చారన్నాడు. అని మళ్ళీ భోరుమని ఏడ్చాడు. యిలా మాటి మాటికీ భోరుమంటుంటె పక్కవాళ్ళ లొంచొకడొచ్చి, 'ఏమిటీ భోరు? ఎందుకలా బెంబేలుపడిపోతారు? ఏం బెంగెట్టుకోకండి మీకొచ్చిన లోటేంలేదు. యిక్కడ మేం వున్నాం; యిక్కడి విషయాలు మేంచూసుకుంటాం; మా కొదిలెయ్యండి, అంటె వచ్చేదంతా మా కొదలమనికాదు. మేం వేటాడస్తా మీ వాటామీకిస్తాం. అలాంటి వన్నీ మనం మనం చూసుకుందాం. మీరలా ఏడవకండి, సీటుకే అపశకునం మీరు సంతోషంగా పై సీటు కెళ్ళండి' అన్నాడు. ప్రమోదరావు సీటొదిలెడ్తానికి భోరు, భోరుమనేడుస్తుంటె యితగాడెప్పుడెప్పుడా సీట్లో కూర్చునేది అని 'ఆవురావు'రుమంటున్నాడు. యితగాడా మర్రోజు పొద్దున్నే ఆఫీసుకొచ్చి ఆ సీట్లో కూర్చుని—

'ఏది? ఎవడూరాడేం? ఏం తేదేం? .. ఎప్పుడు? యింకెప్పుడు?' అని ఆఫీసు ప్యూన్ని గదమాయించటం మొదలెట్టాడు.

'అయ్యా! యిప్పుడెనిమిది కూడా కాలేదు, ఆఫీసు పదిగంటలకి కానీ తియ్యరు గదా' లన్నాడు ప్యూను.

'ఆహానా' అని మర్రోజునుంచి తను మాత్రం ఆఫీసు కేడింటికే వస్తానని అందర్తోనూ చెప్పాడు. ఆఫీసుకి పనిమీ

దొచ్చేవాళ్ళందరికి చెప్పించాడు. యిలా ముందుగా రాపటం యితగాడికి రెండు విధాల కలిసొచ్చింది. పైవాళ్ళు 'ఎంత సిన్సియారిటీ' అనుకున్నారు. పనికొచ్చే వాళ్ళల్లో పనికొచ్చే వాళ్ళతో—

'చూడండయ్యా...మీ కోసం యిప్వుడొచ్చి చేస్తున్నాను. బ్యాంక్‌లాంటి వాటిల్లో ఏక్స్ట్రావర్కు చేస్తే ఎక్కువిస్తారు. మా కదీలేదు...చూస్తారేం; పర్సుల్తియ్యండయ్యా' అనే వాడితగాడు. అలా రెండు చేతులా సంపాదించేవాడు. ఫస్టుకోసం ఎదుర్చూసేవాడుకాదు ... అసలీ సీట్లో కూర్చున్న వాడెవ్వడూ, నువ్వు తప్ప, ఫస్టుకోసం చూసేవాడుకాదు అట్లాచేసి, అట్లాచూస్తే సీటుకే అప్రదిష్ఠ.. యితగాడికి ముఫ్ఫయ్యోతారీఖుకీ ఫస్టుకీతేడావేలేదు. మరి నువ్వో వున్నావ్? పైగా అదే సీట్లో వుంటున్నావ్? ఏం లాభం? నీ మొహం చూసివ్వాళేం తారీఖో చెప్పొచ్చు. నీజేబు కూడా చూడక్కర్లేదు. ఈ బజార్లో వాళ్ళకి కేలండర్లే అక్కర్లేదుట. కేలండర్లమ్మేవాడొస్తే తన్ని బజార్చివర్దాకా తరిమెస్తున్నార్ట, ఎందుకని? నువ్వున్నావ్‌గా! నీ మొహంమీద కేలండరు వేళ్ళాడ్తోంది...కాబట్టి మీ అయిదారొందలాంగానే అయిపోయిందనుకోకు. ముందున్నది ముసళ్ళ పండగా, విసుర్ల పండగాను. ముసలివాడి వయ్యేటప్పటికో గూడు కట్టుక్కూర్చుంటె ఎవరి గోడూ లేకుండా పోతుంది. లేకపోతే విసుక్కోటాలూ. విసురు కోటాలూ, కసురు కోటాలూ తప్పవ్....'

'యికపోతే ప్రమోదరావుకి ప్రమోదం కల్గించే పన్ను చెపుతాను విను. ఒక్క డబ్బివ్వటంవే కాదు. లంచంలో వాటా యిస్తే నీ జేబులోంచిచ్చినట్లు కాదుగదా. అందుకని అతగాడి వాటా అతగాడి కిస్తే నీ జేబులోంచి కూడా కొంచెం రాల్చాలి. ప్రమోదరావు సినిమాలెక్కువగా చూస్తాడు. చూసేవి తెలుగు సినిమాలు కాదు. అట్లా అంటే హిందీ సినిమాల్చూస్తాడని కాదు అసలు యిండియన్ పిక్చర్స్‌ని చూడ్డు. చూసేవన్నీ అమెరికానుం చొచ్చినయింగ్లీషు పిక్చర్లే. తెలుగు సినిమా చూస్తే అవమానం అంటాడు. ఒక భక్తుడొకసారి—

'ప్రమోదరావుగారూ! తెలుగు సినిమా కొత్త దొక టొచ్చింది. తీసుకెడ్తాను వస్తారా?' అన్నాట్ట ప్రమోదరావు ఫెళ ఫెళా నవ్వి—

'ఏవిటి? తెలుగు సినిమానా?!...ఈ జన్మలో కాదు ... లంచాలు మానమన్నా మానేస్తాను కానీ తెలుగు సినిమా మాత్రం చూడన్నాడు. 'నిజంగా లంచాలు మానేస్తా ననుకోనేరు...ఆ మాట మాటవరసకన్నాను. కానీ తెలుగు సినిమా చూడనన్నదిమాత్రం ఖాయం' అన్నాడు. మళ్లీ అంతెక్కువగా డబ్బులుంటె యిటివ్వు...తెలుగు సినిమాకి మాత్రం పెట్టకు' అని ఆ డబ్బులొక్కు

# గురుద్యోగ పర్వం

న్నాట్ట. యితగాడికి యిండియాలో వేవీ పవిత్రరావు. వాటి పేర్చెవితే 'ప్చ్'అంటాడు.

'అయ్యా! విశ్వనాథసత్యనారాయణగారి రచనలు చదివారా? ఎంత గొప్పగా వుంటయ్యో తెల్సా?' అంటే ఏఁవిటో నవ్వుతాడు. 'అయ్యా! అలా నవ్వకండి.. పోనీ ముళ్ళపూడి వెంకటరమణగారి హ్యూమర్ ఎట్లా వుంటుందో తెల్సా?' అంటెమళ్లీ నవ్వాడు.

'అయ్యా! 'ముళ్ళపూడి' అనంగానే మళ్లీ మళ్లీ నవ్వుతున్నారు...మీరు చదివే వుంటారు...అవునా?' అంటె

'నా కవేం తెలియదయ్యా ... అయినా తెలుగులో ... ఒక తెలుగులో ఏఁవిటి? యిండియన్ లాంగ్వేజెస్‌లో ఏం మంచి లిటరేచర్ వుంది? మామ్, మొరేవియా, వుడ్‌హౌస్-వీళ్లగురించడగండి' అంటాడు. అతగాడి అలమర్లో వెదికితే ఒక్క తెలుగు పుస్తకం కనిపించదు. అతగా డొకసారెవరో తెలుగు సినిమాకి లాక్కెడితే తప్పు చేసిన వాడిలా తలొంచుకూర్చుని బయటకొచ్చాక 'ఎంత తలొంపుల పన్చేశాను' అని పదే పదే అన్నాట్ట—అలాంటివాడు ప్రమోదరావు. కానీ యీ మధ్య మనవాళ్లే వాళ్లా వీళ్లా కల్సొక యింగ్లీషు పిక్చర్ తీశార్సూశావ్? దానికి వెళ్లాట్ట ప్రమోదరావు. కాబట్టి అతగాడు ప్రాముఖ్యం యిచ్చేది భాషకేగానీ, మనుషులకి కాదు; వాళ్లెట్లా ఏక్టు చేశారని కాదు; 'మరి మనవాళ్లే వేసిన, తీసిన ఆ సినిమా కెందుకెళ్లావ్?' అని ఎవరో అడిగితే ఏం మాట్లాళ్లేదు ప్రమోదరావు ...అతగాడలా ఎందుకున్నాడన్నది మన కనవసరం...అదో బానిసత్వం. యింతకాలం తెల్లవాడికిందున్నాడు. యిప్పుడు వాడి అలవాట్లకిందుంటున్నాడు. అసల్నా అనుమానం యితగాణ్ణి సృష్టించి ఏ అమెరికాలోనో పడేసిరమ్మని బ్రహ్మ చెవితే సేవకులొస్తు కొచ్చి యిండియాలో పడేశారు. యీ లంచం తీసుకునే గుణం తప్పించి అతగాడి 'కున్నవన్నీ ఫారిన్ లక్షణాలే. కాబట్టి అతగాణ్ణి బాగా మంచిచేసుకోవాలంటె లంచం పక్కనేటే కాకుండా యీ మిగతా వాట్నికూడా చూడాలి...ఆ మధ్య అతగాడి కిందో ఆఫీసరుండేవాడు, ఆఫీసరు కుర్రాడు. ఆ సుభ శేఖరం తక్కువే. పక్కనోళ్లంతా లంచం పట్టి ప్రమోదరావు కివ్వాలన్చెప్పితే అలావే చేశాడు. కాని ప్రమోదరావు కింకా ప్రైవ్రాలేదనీ; రాళ్లేదనీ గుర్రుగా వుంది. అందుకని కుర్రాడు కనిపించినప్పుడల్లా 'ఛర్' మని లేచేవాడు. కుర్రాడి కిదేం అంతుపట్టలేదు. కుర్రవాడ్ది తెల్లనివన్నీపాలు, నల్లనివన్నీ నీళ్లనుకునే మనస్తత్వం. పాలవాడు రోజూ వుగ్గు గిన్నెడు పాలల్లో గిన్నెడు నీళ్లు కలిపిపోస్తుంటె కొత్తగా కాపరానికొచ్చిన పెళ్లాం లేచి—

'యిదేఁవిటండీ! ... నీళ్లు పోస్తున్నాడు మనకి వీడు' అంటె

'భలే దానివేలే... నీళ్లేఁవిటి ... చూడు తెల్లగా వున్నయి. తెల్లగా వున్నయ్ కనుక పాలే' అనే వాడు. యితగాడు ప్రతి విషయంలోనూ అవతలివాడెంత చెపితే అంతేననుకునేవాడు. అర్ధరూపాయిచ్చే చోట రూపాయిచ్చి యింటికొచ్చేవాడు.

కొత్తలో పెళ్లాం 'ఎంతండీ' అంటే 'యింత' అని యిచ్చింది చెప్పేవాడు. కొత్తగా కాపరానికొచ్చిన పెళ్లాం నవ్వుతూ మెత్తగా చివాట్లుపెట్టి 'యిట్లా అయితే బేరాల భారాన్ని నా కొదిలెయ్యండి' అనేది. అందు కొప్పుకోకుండా ఆ మర్నాట్నుంచి కొనుక్కొచ్చి 'ఎంతయ్యిందండీ?' అని అడిగితే 'ఎంతవుతుందో చెప్పు' అని ఎదురు ప్రశ్న వేసేవాడు. పెళ్లాం వాళ్లమ్మమ్మ కాలంలోవున్న ధరలకో అయిదు పైసలు కలిపి చెపితే 'భలేగా కనుక్కున్నావే' అనే వాడు. యింకా పైగా 'యింత కరెక్టుగా ఎలా చెప్పావ్?' అనేవాడు. కానీ అతగాడిచ్చొచ్చింది కరక్టుగా అన్నదానికి కరక్టుగా మూడ్రెట్లుండేది. అలాంటి అమాయకుడు ప్రమోదరావుని నగేవే అర్థం చేసుకుని మిగతా సగం సంగతొచ్చి శేస్తే ప్రమోదరావతగాణ్ణి పూర్తిగా ముంచేశాడు. కాబట్టి మనీ రెండు విధాలా ప్రమోదరావుని మంచి చేసుకో... ముందుగా లంచం తీసుకోవటం మొదలెట్టు...రేపట్నుంచి ఆ పన్చెయ్యి' అని లేచి కూర్చున్నాడు ముక్తేశ్వర్రావ్. కూర్చున్న గురుద్యోగి లేచి ముక్తేశ్వర్రావొంక చుర చురా చూసి—

'ఆ మాట చెప్పటానికి సిగ్గుగా లేదూ? లంచం తీసుకోవాల్టా. లంచం...హు' అన్నాడు.

ముక్తేశ్వర్రావ్ ఫెళ ఫెళా నవ్వేడు.

'ఎందుకు సిగ్గుగాలేదు?.. దీన్నిగురించి యింతగా చెప్పాల్సొస్తున్నందుకు సిగ్గుగానే వుంది. ఎవడన్నా యిట్లా ఓ ముక్క చెపితే అట్లా అందుకుపోతాడు. మర్నాట్నుంచీ బోల్డు లంచం అందుకుంటాడు. నువ్వే యిట్లా వున్నావ్ ?...నీకో సంగతి చెప్పనా? ప్రమోదరావులాంటి వాళ్లతో స్నేహం ఒకే కంచంలో తిని ఒకే మంచంలో పడుకుంటె వృద్ధి కాదు ఒకే లంచం తింటే వృద్ధవుతుంది...

'ఈ లంచం తింటం అవేదేదో పంచ మహాపాతకాల్లో ఒకటిగా అంచనా వేస్తున్నావ్‌లా వుంది. అదేం కాదు. యీ లంచం అవేదొక లాంఛనంగా పూర్వకాలం నించీ వస్తోంది. యీ కలికాలంలో దీనికి మరీ యింత అప్రతిష్ఠొచ్చి పడింది గానీ, పూర్వకాలంలో లంచం ఎంతిచ్చుకుంటె అంత గొప్ప; ఎంత పుచ్చుకుంటె అంత కీర్తి. 'ఫలానా మహారాజు సామంతరాజుల్దగ్గర్నించంత పుచ్చుకున్నాడు; వాళ్లింతిచ్చుకున్నారు' అని పబ్లిగ్గా చెప్పుకునే వాళ్ళు కాలం మరీ పాడైపోయి యిప్పుడిలా కవర్లల్లోనూ, కాగితాల్లోనూ తీసుకోవాల్సొస్తోంది గాని పూర్వం బ్రహ్మాండంగా పళ్లాల్లో పెట్టి, ఊరేగించి, నలుగురికీ చూపించి యిచ్చేవాళ్ళు. 'యింత పుచ్చుకున్నాం' అని కొందరు రాళ్లమీద చెక్కించారు కూడా; ఎందుకంటె ఎంత పుచ్చుకుంటె అంత గొప్ప...'

'దేవుడ్దగ్గిరి కెళ్లినా అంతే చేతులూపుకుంట్లూ పోకూడదు భక్తున్నా లేకపోయినా శక్తికొద్దీ ఏదో ఒకటి తీసుకెళ్లాలి లేకపోతే అపచారం. ప్రతి గుళ్లోనూ 'హుండీ' వుంటోంది. దాన్ని దేవుడికి ముందుగా కాక అంతకు ముందే వుంచుతారు. దాంట్లో వేసినాద్నిపట్టి పుణ్యం వస్తుంది. మనం కూడా అంతే. వాళ్ల పని చేస్తున్నాం; వాళ్ల మనీ తీసుకుంటున్నాం. దీంట్లో తప్పేవుంది ? దేవుడేం చేస్తున్నాడో మనం అదే చేస్తున్నాం. దేవుడు చేస్తున్నది తప్పంటావా? తప్పు, అట్లా అనబోకు. పూర్వం శ్రీకృష్ణుడేం చేశాడు ? నీకా సంగతైలీదులే...'శ్రీకృష్ణుడి కింత సిరుంది; నాకొస్తిస్తాడేమో' నని కుచేలుడు వెళ్లాట్ట. వెళ్లి 'నా సంగతి నీకు తెల్సుగా? నాకేవన్నా యివ్వు' అన్నాట్ట. శ్రీకృష్ణుడు నవ్వి—

'మరి నాకేం యిస్తావ్? ఏం తెచ్చావ్? ఏది? అదేది' అని కుచేలుడు బట్టలన్నీ వెతకసాగాట్ట .... మనం యింకా నయం జేబులు వెతకటల్లేదు...కుచేలుడు 'నాదగ్గిరేంలేదు' అన్నాట్ట. కానీ కుచేలుడి దగ్గర అటుకులున్నయ్. తిరిగెళ్లేప్పుడు తింటాని కుంటయ్ గదా అని 'ఏం లేవు' అనుంటాడు కుచేలుడు దాంతో కృష్ణుడు 'ఏవీ లేకపోవటవేవిటి ? అవి బయటకు తియ్యి' అని ఆ మూట లాక్కుని తిన్నాట్ట. అలా శ్రీకృష్ణుడు అడుక్కు తింటున్న కుచేలుడి అటుకులు లాక్కుని తింటుంటె తప్పని ఎవరన్నారు ? ఎవ్వరూ అన్లేదు. దీన్నిబట్టి మేం నేర్చుకుందీ, నువ్వు నేర్చుకోందీ, ఏవిటో తెల్సా ? 'ఆఫీసు విషయాల్లో ఎంత స్నేహితుడైనా సరే అంతో యింతో లాక్కుని గాని పని చెయ్యకూడదు. అట్లా చెయ్యకపోతే 'లంచ వీయుల' వంశానికే అగౌరవం.'

'యీ లంచం అనే విధానం ప్రకృతిలోనే వుంది నదేం చేస్తోంది? చిన్న చిన్న వాన చినుకుల్ని పట్టుకుని వాట్నన్నిటినీ తీసుకెళ్లి సముద్రానికిస్తోంది. చిన్నవాళ్లని కొట్టి పెద్దవాళ్లకివ్వటం అనేది ప్రకృతి ధర్మం. అదేపని మనంకూడా చెయ్యాలి యీ ప్రపంచంలో ప్రతి విషయం 'గివ్ అంటే టేక్' అనే సిద్ధాంతంమీద నడుస్తోంది. అలా నడిస్తేనే మంచిదని బోల్డు మంది చెప్పారు. 'గివ్ అండ్ టేక్' సిద్ధాంతం అంటే ఏవిటో తెల్సా? 'పైవాడికిచ్చుకో, కింది వాడ్దగ్గర్నించి పుచ్చుకో' అనే దీ నర్థం. యీ పరమార్థం గ్రహించు'

'యీ లంచం పుట్టుకగురించి చెపితె అడేలాంటిదో నీ కర్థం అయ్యి దాని మీదున్న అపోహలు, దురభిప్రాయాలూ పోతయ్. జాగ్రత్తగా విను: ... పూర్వకాలంలోని మనుష్యులు వాళ్ళు చేసేపన్లం డబ్బులు పుచ్చుకునేవాళ్ళు కాదుట. 'మనకి చెయ్యాల్సిన పన్లు ఏదో శేషం వుంటేనే మళ్లీ మనకి జన్మ యిచ్చి అది తీర్చుకురా జీవుడా అని బ్రహ్మ పంపిస్తున్నాడీ లోకం లోకి. 'మనం చెయ్యాల్సిన ఆ పని చేసేందుకు డబ్బు పుచ్చుకోవటం ఏవిటి?' అని అదో బాధ్యతలా డబ్బుల్లేకుండా చేసే వాళ్ళుట. కానీ ఆ సిస్టమ్‌లో కొందరు పనిచేసేవాళ్లు కాదు. అందుకని యిస్సెంటివ్ కోసం యీ జీతా లిచ్చేపద్ధతి బ్రహ్మ ప్రవేశపెట్టాడు.

'యిదేవిటి? మన బాధ్యత నిర్వర్తించేందుకు డబ్బు తీసుకోవటవా?' అని ముక్కుమీద వేలేసుకున్నార్ట కొందరు. వాళ్లంతా నీలాంటివాళ్లే. నువ్విపుడు లంచం పేర్చెప్పితేనే ఆశ్చర్యపడి కోప్పడిపోటల్లేదూ? అప్పుడు జీతాలు పుచ్చు



కున్నా అలాగే అనుకున్నారు కొందరు. 'వాడు జీతం మింగుతున్నాట్ట' అనేవాళ్లు జీతం తీసుకునేవాణ్ని చూపించి. జీతాలు పుచ్చుకున్నవాళ్లని అదోలా చూసేవాళ్లట. కొంతకాలం జరిగాక ముక్కుమీద వేలు తీసేశారు. జీతాలు పుచ్చుకున్నవాళ్లని వెలి వెయ్యటం మానుకున్నారు. అంతా జీతాలు పుచ్చుకోటం మొదలెట్టారు. 'మనం జీతాలు మింగుతున్నాం...బాగా పనిచెయ్యాల'ని కొంతకాలంవరకూ బాగానే పని చేశారు. కానీ తర్వాత మళ్లీ పని మందగించింది. బ్రహ్మ ఆలోచించాడు. కానీ ఏ వుపాయం తోచలేదు. అప్పుడు విశ్వామిత్రుడొచ్చి—

'బ్రహ్మ! నీ సృష్టి ఎప్పుడు బాగుండేడ్చింది గనక? ఎప్పుడూ యిలాగే తగలడింది. యీ జీతాల్తో వాళ్లకి యిన్సెంటివ్ వస్తుందనుకున్నావా? నేను 'లంచం' అనేదాన్ని సృష్టిస్తున్నాను దాన్ని ప్రపంచంలో వదిలావంటే అదే యీ ప్రపంచాన్ని నడిపిస్తుంది. నువ్వా పక్కకెళ్లకుండా ముక్కు మూసుకూర్చున్నా ఫరవాలేదు. అసలు దాన్నిముందే సృష్టిద్దామనుకున్నాను. కానీ నువ్వెక్కడ? యీ జీతాలంటూ సృష్టించావ్. అవేనన్నా సరిగా పనిచేస్తున్నయ్ గనకనా? పనిచేయిస్తున్నయ్ గనకనా?' అని లంచాన్ని సృష్టించాడు. యీ లంచం విశ్వామిత్ర సృష్టి. యిది తప్పేంకాదు. యీ సృష్టిలో బ్రహ్మ సృష్టి, విశ్వామిత్ర సృష్టి—రెండూ వుండాల్సిందే ... యింకో సంగతి చూడు. బ్రహ్మ తొందరపడి జీతాల్ని సృష్టించాడుగానీ లేకపోతే విశ్వామిత్రుడు ముందే యీ లంచాన్ని సృష్టించుండేవాడు; అప్పుడు లోకంలో జీతాలనేవే వుండేవికావు; మన జీవితాలే యిట్లా వుండేవికావు. అంతేకాదు అప్పుడు 'జీతాలు మింగుతున్నాట్ట' అని అనుకునేవాళ్లు. కాబట్టి జీతం, లంచం కొంచెం ముందూ వెనకగా రావటంవల్ల యిదంతా జరిగింది. యిదంతా ఎందుకు జరిగింది? బ్రహ్మ తొందరపడటంవల్ల కాదూ? అందుకే 'తొందర పనికిరాదు. దానివల్ల మనపని కాదు' అంటారు. కానీ యిక్కడ తొందరపడింది మనం కాదు బ్రహ్మ పడ్డాడు. పడ్డవాడే దాని

# గురుద్యోగ పర్వం

ఫలితం అనుభవించాలి. అందుకని మనం లంచానే పడ్డాం. యిదేం తప్పు కాదు. జీతాల పద్ధతి మొదటిగా వచ్చినప్పుడు కూడా 'జీతాలు తింటున్నాట్ట' అని అనుకునేవాళ్లట. తర్వాతట్లా అంటం మానేశారు. యిప్పుడు జీతాలకోసం బహిరంగంగా సమ్మెలుకూడా చేస్తున్నారు. అట్లానే కొన్నాళ్ళు 'అతగాడు లంచం తింటున్నాట్ట' అనుకుని మానేస్తారు. యిప్పుడెవరూ పెద్దగా పట్టించుకోటంలా. 'అవును...అతగాడు విశ్వామిత్ర అనుయాయుడు. యిది డెమోక్రసీ. కనీసం రెండు పక్షాలన్నా వుండొద్దూ. ఒకటి జీతాలు




పుచ్చుకునే పక్షం, యింకోటి లంచాలుకూడా పుచ్చుకునే పక్షం' అని అంటున్నారు. కొన్నాళ్ళ పోతే యీ యీ ఆఫీసుల్లో లంచం రేట్లు పెంచాలి అని సమ్మెలు కూడా చేస్తారు. కాబట్టి లంచం అనేదొక తప్పు కాదు...' అని ఆగాడు ముక్తేశ్వరరావు.

గురుద్యోగి కాస్సేపు ముక్తేశ్వరరావు ముఖంలోకి చూశాడు. కాస్సేపాగి—

'అయితే ... అన్నాఫీసుల్లోనూ యిదే పద్ధతా?' అన్నాడు. ముక్తేశ్వరరావు ముందు కొంగి—

'నీకేమన్నా పిచ్చా? యిది ప్రపంచ రీతి; అందులోవున్న మనుష్యుల కుండాల్సిన నీతి ...నీ కొక కథ చెపుతా పట్టు...

పూర్వం ఓ రాజుగారి కేదో జబ్బు చేసింది. కాని వాళ్ళు లేని పోనివన్నీ సృష్టించి 'లంచా లెక్కువగా తింటం వల్లొచ్చిందా జబ్బు' అన్నారు. అయిన వాళ్లదేం కాదన్నారు. ముందెన్నో మందులు పోశారు. కానీ వ్యాధి ఏం తగ్గలేదు. చివరికి 'లంచం పుచ్చుకోని మనిషొచ్చి రాజుగారి మంచం పక్కన ఓ పది నిమిషాలుంటే అతగాడి జబ్బు నయం అవుతుందని శాస్త్రజ్ఞులు చెప్పారు. రాజు మహామంత్రిని పిల్చి 'మంత్రిగారూ! మీరొచ్చి నా పక్కనో పది నిమిషాలు కూర్చోండి' అన్నాడు. మంత్రిగారు తలొంచుకుని 'రాజుగారూ! పది నిమిషాలేం ఖర్మ? పది రోజుల్నుంచీ యిక్కడే కూర్చున్నాగా?' అన్నాట్ట. రాజభవనంలోని వాళ్లూ, రాజనగరు వాళ్లూ రోజూ వచ్చి చూసిపోతూంటారు కాబట్టి వాళ్లల్లో లంచం తీసుకోని వాడెవరూ లేడని తెల్సిపోయింది. అందుకని రాజ్యంలో చాటింపు వేశారు. యీ చాటింపు విని అందరూ—

'సంజీవి తెమ్మనటంలో అర్థం వుంది కానీ, యిలాంటివాణ్ణి తెమ్మంటే ఎక్కణ్నుంచి తెస్తాం' అన్నారు ... ఎవ్వరూ రాలేదు. రాజుగారు చచ్చిపోయాడు.' అని ఆగాడు ముక్తేశ్వరరావ్.

'అయ్యో, చచ్చిపోయాడా?' అన్నాడు గురుద్యోగి.

'అవును; చావకేం చేస్తాడు. యిదేమన్నా అంత తేలిక విషయమా? మువ్వప్పటికి పుట్టలేదాయిరి...కాబట్టి ఓ గురుద్యోగీ! యీ కథ యీనాడూ జరుగుతున్నదే. యీ ప్రపంచంలో లంచం పుచ్చుకోనివాడూ, యిచ్చుకోనివాడూ లేడు. కనీసం ఓ పండన్నా లంచంగా పుచ్చుకుని, ఓ పావలా ఏ ఆఫీసు ప్యూన్‌కో యిచ్చుకొమ్మంటాడు...కాబట్టి నువ్వు కూడా పుచ్చుకో; ప్రమోదాని కిచ్చుకుని ప్రమాదం తప్పించుకో' అని ఆగాడు ముక్తేశ్వరరావ్.... ముక్తేశ్వరరావ్ మళ్లీ మొదలెట్టాడు:

'యింకో సంగతి యీ రోజుల్లో అందరూ లంచం యిచ్చుకోవాల్సొచ్చిందనే వాళ్లే కానీ వాళ్లు పుచ్చుకున్నది మాత్రం చెప్పరు. ఆ మాటలు విని నువ్వు ఎవరూ లంచం పుచ్చుకోటల్లేదనుకుంటున్నావ్. ఆ మాటల్లో ఎంత నిజం వుందో యీ కథ వింటే తెలుస్తుంది...'

'రాజుగారు చచ్చిపోయాక యువరాజు సింహాసనానికొచ్చి 'ఏవిటి? యీ రాజ్యం యింత లంచమయంగా వుందా?' అని రాజ్యంలో వాళ్ళందర్నీ పిలిపించి ఎవరెంత పుచ్చుకున్నదీ, ఎవరెంత యిచ్చుకున్నదీ చీటీలమీద రాసి డబ్బాలో పడెయ్యమన్నాడు. ఆ చీట్లన్నీ చూస్తే అంతా యిచ్చుకున్నట్టే రాశారు గానీ పుచ్చుకున్నట్టు రాయలేదు.. గురుద్వోగీ! నువ్వే చెప్పు. అందరూ లంచం యిచ్చుకున్నవాళ్లే అయితే లంచం పుచ్చుకున్నవాడెవడు? చెప్పు.. యిప్పుడు కూడా ప్రతివాడూ యిచ్చుకున్నానంటాడు కానీ పుచ్చుకున్న సంగతి చెప్పడు.

కాబట్టి ముందే మేలుకుని దీపం వుండగానే యిల్లు చక్కపెట్టుకో ఉద్యోగం వుండగానే యిల్లు కట్టుకో. యీ ప్రపంచంలోని పరమార్థం నీ అంతట నువ్వే ఏనాటికైనా తెల్సుకుంటావ్. నేర్చుకుంటావ్ కూడాను - నేర్చుకోకేంచేస్తావు? నీ చుట్టూ వున్న ప్రపంచం అలాంటిది. సిగరెట్లు కాల్చేవాళ్ల మధ్యంటె సిగరెట్టు కాల్చటం అలవాటవుతుంది తాగేవాళ్ళమధ్యంటె తాగటం అలవాటవుతుంది. అట్లా అలవాటయితే ఆ తప్పమనదా? కానే కాదు ... 'కంపెనీ కోసం కాల్చండి' అని ఓ సిగరెట్టిస్తే తాగితే తప్పా? తాగకపోతే తప్పు. అట్లానే 'కంపెనీకోసం కొంచెం లంచం పట్టుకోండి' అంటే పట్టుకోకపోతే చాలా పాపం పైవాడికి కోపం కూడా వొస్తుంది. అలా చెయ్యకపోతే తప్పు. ఒక్కొక్కప్పుడు ముప్పు కూడాను. కాబట్టి నువ్వే ఎప్పటికయినా నేర్చుకుంటావ్. కానీ నే చెప్పేదేవిటంటె కొంచెం తొందరగా నేర్చుకోమని. ఉద్యోగాన్ని పట్టుకునున్నప్పుడే నాలుగు డబ్బులు రాబట్టుకోవాలి చేతులు కాలిం తర్వాత ఆకులు పట్టుకునేం లాభం? అట్లానే వుద్యోగం వూడాక నలుగుర్ని పట్టుకుని ఏం లాభం?...యింకో సంగతి. యిహనించి పీటిమీద కొన్ని కొత్త నిబంధనలురావచ్చు, యిప్పటికే చూడ్డాదూ? కొన్ని గుళ్లల్లో హుండీలో డబ్బు లేస్తారని కాబోలు చొక్కా లేసుకుని లోపలికి రానివ్వరు. చొక్కాలిప్పి గుడి బయట పెట్టిస్తారు. అట్లానే ఆఫీసులకి పనికోసం వచ్చే వాళ్లమనీ పర్సులూ, చొక్కాలూ తీసి గేటుదగ్గరే పెట్టిలోపలికి వెళ్లాలనే నిబంధన వొచ్చిందనుకో! అప్పుడు నీకు లంచం తీసుకోవాలనే సద్బుద్ధి పుట్టినా డబ్బు మాత్రం పుట్టదు. జాగ్రత్తపడు అందుకే తొందరగా మేలుకో, ఆ సీట్లో కూర్చుని యిష్టరాజ్యంగా ఏలుకో, యీ బీదరికాన్నుంచి కోలుకో. యింకో విషయం. ప్రపంచంలో లంచం తీసుకోనివాడు లేడని యిదివరకే చెప్పాను. ఎవడన్నా వున్నాడూ అంటే వాడికా లంచంపట్టే అవకాశం లేదనే లెక్క. అవకాశంలేనివాడు 'తీసుకోకపోతేవాడు నిష్కళంకంగావున్నట్టు లెక్కకాదు. బలహీనుడి అహింసావాదం లాంటిది... అందుకని తొందరగా వెళ్లి లంచాలు పుచ్చుకో. లే' అని గురుద్వోగి రెక్క పుచ్చుకుని లేవదీశాడు ముక్తేశ్వర్రావు,

అలా రెక్కపుచ్చుక లేపుతుంటె గురుద్వోగి విదిలించుకోలేదు, అట్లాగని ముక్తేశ్వర్రావుని కౌగిలించుకోనూ లేదు, తటస్థంగా వున్నాడు. మంచికీ, చెడుకీ తటస్థం ఏవిటి? తటస్థంగా వున్నాడంటె చెడువేపుకి మొగ్గుతున్నట్టే లెక్క అని అనుకున్న ముక్తేశ్వర్రావు సంతోషించాడు. గురుద్వోగి రెక్క విదుల్చుకోకుండా—

'మనం యిక్కడ తప్పించుకున్నా పైనున్న దేవుడు మనల్ని క్షమిస్తాడా?... నరకానికి పోవూ?' అన్నాడు.

ముక్తేశ్వర్రావ్ యథాప్రకారం ఫెళఫెళా నవ్వాడు, గురుద్వోగీ ప్రశ్న అడగంగానే ముక్తేశ్వర్రావుకి వుత్సాహం వొచ్చింది. యిక్కడి గొడవలోంచి లేపి ఎక్కడోవున్న దాన్సంగతడుగుతున్నాడంటె అదేదో వూరికే లాంఛనంగా అడిగాడనే అర్థం. అదేం పెద్ద పట్టింపుగాదని తెల్సు, అయినా ఆ మాత్రం అనుమానం మాత్రం ఎందుకుంచాలని ముక్తేశ్వర్రావు మొదలెట్టాడు.

'గురుద్వోగీ! ... ఆ లోకం అంటూ ఒకటున్నదని నమ్ముతున్నావా? నరకం స్వర్గం అవి ఎక్కడోలేవు యిక్కడే వున్నయ్. లంచాలు పట్టలేక నీలాటి వాళ్లను భవిస్తున్నారే ... ఆ బాధే నరకం. ప్రమోదరావులాంటి వాళ్ళు గడిపే జీవితమే స్వర్గం...వప్పుకోవా? సరే, నువ్వాలోచించినట్లే స్వర్గ నరకాలున్నయ్యనుకుందాం. అనుకోవటం ఏవిటిలే; వున్నయ్. మరయితే జీతాలు పుచ్చుకున్నవాళ్ళు స్వర్గానికెడితే, లంచాలు పుచ్చుకున్న

వాళ్లెక్కడ కెళ్లాలి!?...ఆఁ. యిప్పుడే గుర్తొచ్చింది నాకు. స్వర్గంవుంది; ఒక స్వర్గంకాదు; రెండు స్వర్గాలున్నాయ్; జీతాలు పుచ్చుకునేవాళ్లకొక స్వర్గం; లంచాలుకూడా పుచ్చుకునేవాళ్ల కింకొక స్వర్గం. అవి రెండున్నమాటేకానీ, సదుపాయాలూ, సౌకర్యాలు విషయంలో ఆ రెండిటికీ భేదంలేదు రైళ్లలోని ఫస్టుక్లాసుకీ, థర్డుక్లాసుకీ వున్నంత భేదం వుందనుకోకు ఆ భేదం స్వర్గానికీ, నరకానికీవుంది. అసలి రెండో స్వర్గం కథేవిటో చెపుతాను విను:'

'మొదటిగా లంచం పుచ్చుకున్న పెద్దమనిషి చచ్చి స్వర్గానికెళ్లాట్ట. స్వర్గం దగ్గిర కాపలావాళ్లు లోపలికి రానివ్వలేదుట. వాళ్లు వెళ్లొద్దంటుంటె ఆయన ఓనవ్వు నవ్వి 'అదా సంగతి... నాకు తెల్సులే' అని వాళ్లచేతిలో రెండు రూపాయలు పెట్టి లోపలి కెడ్తుంటె వాళ్లారూపాయలు పారేసి ఆయన్ని పట్టుకుని 'వెళ్లకూడదు...నువ్వు లంచం పుచ్చుకున్నావ్' అన్నారు. అంటె యితగాడు విన్లేదు.

'అవును...లంచం మింగాను. తప్పా?' అన్నాట్ట. అతగాడికి లోపలి కెళ్లగూడదని చెప్పేసరికి కాకుండా చెప్పటానికే బ్రహ్మదేవుడు దిగొచ్చాడు. దిగొచ్చి—

'నాయనా! విశ్వామిత్ర అనుయాయుడా! నీకు దీంట్లో ప్రవేశంలేదు. యిది జీతం ఒక్కటే మాత్రం తీసుకున్నవాళ్లకేగాని, జీతం బత్తెం తీసుకున్న నీలాటివాళ్లకాదు' అని 'ఛీ' అని ఓ తన్ను తన్నాడు

# గుతుద్యోగ పర్వం

అతగాడు క్రిందపడిపోతూ 'హా! విశ్వామిత్రా!' అని ఓ పొలికేక పెట్టాడు. ఒకూరి పొలిమేరకి దూరంగా తపస్సు చేసుకుంటున్న విశ్వామిత్రుడ్నాపి, జరిగిందంతా గ్రహించి—

'వత్సా! లంచం తీసుకున్నాడని ఆ స్వర్గంలోకి రానివ్వలేదూకదూ? బ్రహ్మ. నీకేం తక్కువయింది? లక్షణంగా అక్కడే వుండు' అని అతగాణ్ణక్కడే నిలబెట్టి అతగాడి చుట్టూ 'త్రిశంక స్వర్గం' కట్టించి అతగాణ్ణక్కడ కూర్చొబెట్టాడు. ఆనాటినుంచి లంచం పుచ్చుకున్నవాళ్లు యిక్కడ స్వర్గం అనుభవించి త్రిశంక స్వర్గంవేపుకీ, జీతం మాత్రం పుచ్చుకున్న వాళ్లు యిక్కడ నరకం అనుభవించి అక్కడ స్వర్గానికీ వెడుతున్నారు...

'కాబట్టి రేపట్నించే మొదలెట్టు. రేపేఁవిటి? శుక్రవారం ... యింకేం? దివ్యంగా వుంది. నువ్వు చేసేపని దివ్యదృష్టి వున్నవాడు కూడా కనుక్కోలేడు. యికలే...' అంటూ లేచాడు ముక్తేశ్వరావ్. గురుద్యోగి ఆలోచిస్తూ

'సరే...చూద్దాంలే' అన్నాడు

'చూద్దాం అంటే కాదు. మళ్లీ ఏడెనిమిది నెలల్లోనే వొస్తాను అప్పటికో స్కూటరు నాకు చూపించాలి ఆ తర్వాత మళ్లీ వచ్చేవేళ్టికి కారు కొనాలి; స్కూటరు నా కివ్వాలి తెల్సిందా?' అన్నాడు ముక్తేశ్వరావు. అని నవ్వాడు...గురుద్యోగి నవ్వాడు ... ముక్తేశ్వరావా పాయంకాలం వెళ్లిపోతూ,

'నీ యిల్లు బంగారంగానూ ... వస్తానోయ్' అంటూ వెళ్లిపోయాడు.

గురుద్యోగా రాత్రంతా ఆలోచించాడు. బోల్డు కలలొచ్చినయ్. కలలో సోఫాలు, కుర్చీలు, ఫేన్లు, కార్లు ... ఏఁవేఁవిటో కనిపించినయ్. లేచిచూస్తే చుట్టూ పాత గోడలూ, పాత మంచాలూ కనిపించినై.

'యిది కలా?!' అనుకున్నాడు.

'కాదు...యిది కలకాకూడదు. యిదే నిజంకావాలి' అని అనుకుంటూ లేచి తొందరగా ఆఫీసు కెళ్లిపోయాడు.

...ఏడాది గడిచింది ఏడాదిలోపలే గురుద్యోగి యింటి ముందొక గేరేజి కట్టించాడు.

'గేరేజి కట్టించారుగానీ కా రెప్పుడు వొచ్చేది?' అంది పెళ్లాం.

గురుద్యోగి విలాసంగా నవ్వుతూ—

'నీరుపోసిన దేఁవుడు నారుపొయ్యక పోతాడా? గేరేజి కట్టించినవాడు కారియ్యక పోతాడా?...చూద్దాం' అన్నాడు...

...గురుద్యోగి బజార్లో వాళ్లందరూ కేలెండర్లు కొనుక్కున్నారు. యిప్పుడు గురుద్యోగి మొహం చూస్తే ఎప్పుడూ ఫస్టుతారీఖే కనిపిస్తోంది పైగా నిలువు బొట్టు కూడా పెట్టుకుంటున్నాడు. గురుద్యోగింటికి ప్రమోదరావు కారేసుకు వొస్తున్నాడు. 'వచ్చే ఏడు కారు కొనెయ్యవయ్యా' అని గురుద్యోగిని వొత్తిడి చేస్తున్నాడు...గురుద్యోగి కారు కొన్నాడు.

ఓ రోజు కార్లో షికారు కెడ్తూ పక్కనున్న పెళ్లాంతో— 'జీతం–బత్తెం'– రెండిట్లో ఏది లేకపోయినా కష్టఁవే... అందులో రెండోది లేకపోతే మరీ నష్టం అందుకే మనవాళ్లు జీతం బత్తెంలేనుద్యోగాలు చెయ్యొద్దంటారు' అని నవ్వాడు గురుద్యోగి.

'అవును' అంది పెళ్లాం రవ్వలదుద్దుల్లో పడిన జుట్టు సవరించుకుంటూ.

(ఇంకావుంది)




ఎం శంకరరావు, వేల్వూరు

మనసారా ప్రేమించి మోసంచేసిన ప్రేయసిని ఏంచేయాలి?

**జీవితంలోని పీడకల అని మర్చిపోవడం శ్రేయస్కరం.**

ములగడ విజయలక్ష్మి, కోటి— కేశవరం

నన్ను ఎవరయినా నీ అభిమాన నటి ఎవరని అడగ్గానే టక్కున వాణిశ్రీ అని సమాధానం చెప్తాను, ఎందుకు ?

**మీ అభిమానాన్ని చూరగొన్నాను గనుక.**

కె. సుందరం, కోవనూర్

మీరు చిల్లరకొట్టు చిట్టెమ్మలో చిట్టెమ్మగా నటించారని నేను—కాదని నా స్నేహితుడు అంటున్నాము. మీరేమంటారు?

**మీ మాటే నిజమంటాను.**

కుమారి పి. సులోచన, అనంతపూర్

నాకు సినిమాలో చేరాలని చాలా యిష్టముగా వుంది. చేరకపోతే పిచ్చి పడుతుందని నా నమ్మకం. మరి మీ నమ్మకమేమిటో?

**చేరిన తర్వాత పిచ్చిపడ్తే ఏం చేస్తాం.**

వల్లభదాసు, ఆదిత్య, అనకాపల్లి

మానవునికి 'వాణి' ముఖ్యమా? 'శ్రీ' ముఖ్యమా?

**రెండూ ముఖ్యమని తెలిసే నాకు ఆ పేరు వచ్చింది.**

ఎస్. గంగరాజు, రాజనగరం

ప్రియమయిన వాణిశ్రీగార్కి! మీరు తొలిసారిగా మిమ్ములను తెరమీద చూచుకునప్పుడు మీకు కల్గిన అనుభూతి ఏమిటి?.

**అది మాటల్లో చెప్తే తీరేది కాదు, సోదరా!**

ఎస్. సాంబశివరావు, వి. మాధవరావు, గుంటూరు.

హల్లో, వాణిశ్రీ, మిమ్మల్ని కలవాలని వుంది? ఎలా?

**హల్లో, హాయిగా మద్రాసుకు రండి.**

వై. వేణుగోపాల్, బి. ఎస్. సి. (అగ్రి) ఆదోని

మీ లక్కీ నెంబరు ఎనిమిదటగా! ఆ నెంబర్లో మీకు కల్గిన అదృష్టాలేమిటి?

**ఒకటా, రెండా, చెప్పేందుకు— కోకొల్లలు.**

కె నాగిరెడ్డి. బలిజేపల్లి

మీరు ఎప్పుడు పెళ్ళి చేసుకుంటారు. మీరు కూడ ఒక ఇంజినీరునుగానీ, ప్రొఫెసర్ను గానీ పెండ్లిచేసుకుంటారా? లేక సినీనటుడ్ని పెళ్లిచేసుకుంటారా?

**ఎవరి కర్మకు ఎవరు బాధ్యులు. అంతా వాడి లీల.**

జవ్వాదిలక్ష్మి కోటీశ్వరరావు, నెకరికల్లు

ప్ర : ఉత్తమ చిత్రాలలో మీరు నటించిన సందర్భంగా తీయించుకున్న మీ అత్యుత్తమ ఛాయా చిత్రం మాకూ పంపించగలరా? దానికేమయినా నిబంధనలున్నాయా?

**జ ఇంతవరకు నేను యే చిత్రంలోని ఛాయాచిత్రం సేకరించ లేదు. అలాంటిది జరిగితే, మిమ్మల్ని మర్చిపోను లెండి.**

వి సరోజ, హైద్రాబాదు

ప్ర : నా 'ఆల్బమ్'లో మీ ఫొటో అతికించుటకు మీ కిష్టమేనా?




**జ: మీ 'ఆల్బమ్' అంటూ నా యిష్టాన్ని అడుగుతారేమిటి ●**



'సుడిగుండాలు'లో నాగేశ్వరరావు, సాక్షి రంగారావు

చిత్రసమీక్ష

## సువర్ణనంది నందుకున్న విజ్ఞానాత్మక చిత్రం

# సుడిగుండాలు

'నేటి బాలలు రేపటి పౌరులు' అనే సూక్తితో బాలలను తీర్చిదిద్దలేని పెద్దల లోపాన్ని, ఆ సూక్తి యోగ్యతని కాపాడలేని తల్లిదండ్రుల అజ్ఞానత్వాని సూటిగా వేలెత్తి చూపుతూ—

నేరానికి శిక్షాస్మృతి ఎంతవరకు న్యాయం చేకూర్చుతున్నది? న్యాయస్థానాలు సంఘ జీవనాన్ని బాగు చేయడానికి ఎంత వరకు ఉపయోగిస్తున్నాయి? అని బాధపడుతూ—

ఎదురయ్యే దారుణ పరిస్థితుల్ని గుర్తించలేని ఈ దేశం ఏమైపోతుంది? అనే శేష ప్రశ్నతో ప్రేక్షకుల్ని ఆయా ఆలోచనా సాగరంలో ముంచివేసే ప్రబోధాత్మక చిత్రం 'సుడి గుండాలు'

చిత్రంలో ప్రధానాంశం ఒక జాతి సమస్య కాదు ఒక దేశం సమస్యా కాదు నేటి నాగరక ప్రపంచం సమస్య ఈ సమస్యని దర్శక నిర్మాతలు అవగాహన చేసుకుని, ప్రజల్లో చైతన్యం రప్పించాలనే తలంపుతో ఒక ప్రయోజనాత్మక చిత్రాన్ని ప్రయోగించడం చరిత్రలోను చలనచిత్ర చరిత్రలోను గొప్ప విషయం!

జడ్జి చంద్రశేఖరం గారి అల్లారు ముద్దుల కొడుకు రాజా హత్యకి రాణి, విక్రమ్ అనే ఇద్దరు చిన్నవాళ్ళు నేరస్థులుగా కోర్టులో రుజువవుతారు చంద్రశేఖరం గారు ఆ పిల్లల తరఫున వకాల్తా తీసుకుని వారి వారి తల్లిదండ్రుల్ని ప్రశ్నిస్తారు పిల్లల సంరక్షణలో తమ తమ పాత్ర లెంతెంత అల్పంగా వున్నవో అమాయకంగా వెల్లడిస్తారు ఆ తల్లిదండ్రులు! తద్వారా, పిల్లల గురించిన కష్టసుఖాలు తల్లిదండ్రులు పట్టించుకోనట్టు, వారు సర్వ స్వతంత్రులయి నేరస్థులుగా తయారయినట్టు విశదమవుతుంది జడ్జిగారు ఈ గుట్టును సాకల్యంగా బయటి ప్రపంచానికి వివరిస్తారు శిక్షార్హులు ఎవరు? పిల్లలా, పిల్లల తల్లిదండ్రులా? అన్నప్పుడు సమాధానం కష్టసాధ్యంకాదు కాని, న్యాయస్థానాలు ఈ సమాధానానికి సమాధానం చెప్పుకోవలసి వుంటుంది! తల్లిదండ్రులు పిల్లల్ని ఇలా విచ్చలవిడిగా వదిలివేస్తే దేశం ఏమైపోతుంది? అని జడ్జిగారు నేల కొరిగి పోతారు.

అవును ఏమవుతుంది? అని అనుకుంటూ ప్రేక్షకులూ లేస్తారు!

ముఖ్యంగా, పిల్లలు చెడిపోటానికి కారణం అసభ్య చిత్రాలు, అసభ్య రచనలు అని వాటిమీద దుయ్యబట్టటం జరిగింది. ఇదొక ఆదర్శవంతమయిన ఫక్కీ.

చిత్రాంతంలో ఒక సందేహం రాక మానదు. ప్రజల్ని ఉద్ధరించే చిత్రమయినప్పుడు దాన్ని ప్రజలు తప్పకుండా చూడగలిగి వుండాలి కదా! మరి, వారికి ఇందులో ఎలాంటి ఆకర్షణ వున్నది? అనుకున్నప్పుడు మృగ్యమని చెప్పడానికి లేదుగాని, తక్కువ తరగతి ప్రజలు చిత్రాన్ని మెచ్చుకోక పోవటానికి చాలా కారణాలు కనిపిస్తాయి బంగారు నంది విశేషాకర్షణే కావొచ్చు! ఇలాంటి సందేశాత్మక చిత్రాలకి సువర్ణనందితో చేతులు దులుపుకుంటే ప్రభుత్వ కర్తవ్యం చాలినట్టు కాదు, వినోదపు సుంకాన్ని రద్దు చేస్తే చిత్రం కొంతవరకు జనబాహుళ్యానికి అందుబాటులో వుంటుంది ఇది పెద్దలకి సంబంధించిన చిత్రమయినా, పిల్లలకి తక్కువ చార్జిలమీద చూపించినప్పుడు లక్ష్యం నెరవేరక పోదు!

నటీ నటులంతా చిత్రం ప్రతిభతో పోటీ వేసుకుని నటించినవారే మాస్టర్ రాజా అందులోమేటి పద్మశ్రీ నాగేశ్వరరావు చిత్రానికి ప్రాణం ప్రసన్నరాణి, కృష్ణంరాజు, రంగారావు (సాక్షి), సుకన్య, సంధ్యారాణి, రామ్మోహన్, గుమ్మడి శ్రీరాములు మొదలైనవారు చిత్రానికి నిండుజీవం పోశారు

కథని బి యస్ థాపా, డైలాగులు నంది రాశారు. ఫొటోగ్రఫీ కె యస్ క్రిష్ణ, సంగీతం కె వి మహాదేవన్ నిర్వహించారు

చక్రవర్తి చిత్రని స్థాపించి, సంస్థ ఆశయాన్ని ఆదర్శవంతంగా చిత్రీకరించడంలో నట సామ్రాట్ అక్కినేని నాగేశ్వరరావు, దర్శక చక్రవర్తి ఆదుర్తి సుబ్బారావు కృతకృత్యులయ్యారు వారి కృషి బహుధా ప్రశంసనీయం

—సికరాజు ●

తప్పకచూడండి!



శ్రీరాజ్‌ప్రొడక్షన్స్

సమర్పించు



# ముద్దుపాప

మాటలు-పాటలు

అనిసెట్టి

దర్శకత్వం

K.S.గోపాలకృష్ణ

సంగీతం

K.V.మహాదేవన్-పామర్తి



ఆంధ్ర జోతి.
నైజాం డేషా.
సీడెడ్ జయలక్ష్మీ.



# సినిమా

'పెళ్ళినాటి ప్రమాణాలు', 'కృష్ణార్జున యుద్ధం' చిత్రాలను నిర్మించిన శ్రీ పి. ఎస్. రెడ్డి పద్మశ్రీ యన్. టి. ఆర్. నాయకునిగా నిర్మించే మహోజ్వల జానపద చిత్రానికి 'భాగ్యచక్రం' అని పేరు పెట్టారు. ఈ చిత్రంలో ఆషాడభూతిగా శ్రీ రామారావు అద్భుతంగా నటించినట్లు దర్శకులు శ్రీ కె. వి. రెడ్డి వెల్లడించారు. ఈ చిత్రంలో ప్రేక్షకుల్ని మైమరపించే దృశ్యాలు, ఆశ్చర్యచకితుల్ని చేసే సన్నివేశాలు చలా వున్నాయి. శ్రీమతి సరోజా దేవి యింతవరకు చూడని కొత్త రకం గెటప్‌లో కనిపిస్తారు. పాములవాడిగా శ్రీ రాజనాల నటించారు. శ్రీ పింగళి నాగేంద్రరావుచే కథ, మాటలు, పాటలు వ్రాయబడిన యీ చిత్రానికి గోఖలే కళా దర్శకుడు. పెండ్యాల నాగేశ్వరరావు సంగీతాన్ని విన్పించారు. కమల్‌ఘోష్ కెమెరాను నిర్వహించారు. శ్రీ పసుమర్తి నృత్య దర్శకత్వంలో ఈ చిత్రంలోని నృత్యాలు చిత్రీకరింపబడ్డాయి. ముఖ్య పాత్రలను పద్మశ్రీ రామారావు, సరోజాదేవి, రాజనాల, ముక్కామల, పద్మనాభం, గీతాంజలి, ఋష్యేంద్రమణి, కనకం, సురభి బాలసరస్వతి, లింగమూర్తి, పేకేటి, బేబి మల్లిక పోషించారు. శ్రీ కె. వి. రెడ్డి బి.ఎస్.సి(ఆనర్స్) 'పాతాళభైరవి'లో సాధించిన విజయాన్ని 'భాగ్యచక్రం'లో సాధించవచ్చునని అనిపిస్తున్నది.

## తల్లికి మించిన పిల్లలు

'జీవితబంధం' సెట్టులో రాజసులోచనను చూచి నిర్ఘాంతపోయాను! ఆమె చాలా నీరసంగా వుండడమేగాక మరీ సన్నగా వున్నట్లు అనిపించింది. ఈ సడన్ మార్పుకు కారణమేమని ఆమెను అడిగాను. ఆమె నవ్వుతూ యిలా అంది — 'నేను 'తిరుమాల్ పెరుమై' చిత్రంలో నాట్యం చేసేందుకుగాను లావు తగ్గాను



# స్టైలులోను
# స్పీడులోను



# సాటిలేనిది!

మీకు వాస్తవంగా మంచి సైకిల్
కావాలనుకుంటే కొనవలసినది

## నార్టన్

లేక

## నార్టన్ డిలక్స్








నార్టన్ మరియు నార్టన్ డిలక్స్‌ను వాడితే రోడ్ మీద అవి ఎంత వేగంగా, చక్కగా వెళ్తాయో మీకే తెలుస్తుంది! ధర విషయంలో కూడా పోటీలో ఏ సైకిల్ అయినా సరసంగా వుంటుంది. ఎందుకంటే కచ్చితమైన క్వాలిటీ కంట్రోల్‌తో ప్రతిభాగము ఒకే సంస్థచే అతి తక్కువ ఖర్చుతో చేయబడుతుంది.

**హింద్ సైకిల్స్ లిమిటెడ్**
250 వర్లి, బొంబాయి 25.

[illegible]కు మోటగావుండేవి, వ్యక్తి వెళ్లడానికి తేలికగా వెళ్లే, దృఢమైనవి, నవయువకులకు స్పోర్టింగ్ సైకిళ్లు మొదలైన సైకిళ్లు పూర్తి రేంజ్‌లో లభిస్తాయి.

SAS. HC-22 TEL

నేను నీరసంగా వుండానికి కారణం నేను యిటీవల జ్వరంతో బాధపడడం. ఒక నెల క్రితం హొగానికల్ వెళ్లాను. అప్పుడు గంటల తరబడి చన్నీళ్లలో స్నానం చేశాను.




# సినిమా

పడిసం పట్టింది. దాన్ని ఖాతరు చెయ్యకుండా భిలాయ్, నాగపూర్ వెళ్లి ప్రదర్శనలు యిచ్చి వచ్చాను. అక్కడి నుండి రావడమే జ్వరంలో పడ్డాను. పక్షం రోజుల వరకు జ్వరం విడిచిందికాదు. ఇప్పుడే రెండు రోజులుగా పత్యం తీసుకుంటున్నాను' అంది. మరి మీ పాపల సంగతి చెప్పరేం? అని ప్రశ్నించాము. అబ్బా! వేలెడంత లేరు—ఎంత ఘటికులయ్యారో తెలుసా! నేను డ్యాన్సు ప్రాక్టీసు చేస్తుంటే దాన్ని వాళ్ళు అలాగే నేర్చుకుంటున్నారు. గొంతెత్తి పాడగలస్తారు కూడా. మొత్తానికి నా పిల్లలు నన్ను మించిన కళాకారులు అవుతారేమో ననిపిస్తుంది' అన్నారు.

* * *

బుచ్చిరెడ్డిపాళెం తిరునాళ్ల సంబరాన్ని శ్రీ ఆత్రేయ తన పిక్చరుకు వుపయోగించుకునేందుకు ఆ గ్రామపెద్దలు శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డి సకల సదుపాయాల్ని కల్పించినందుకు, వారి బంగళాను తన చిత్రానికి యిచ్చినందుకు ఆత్రేయ తన కృతజ్ఞతల్ని చెప్పుకున్నారు. శ్రీ లక్ష్మణ్ గోరే రాకెట్ వేగంతో తన కెమెరాను నడిపించి, చిత్రానికి సంబంధించిన కొన్ని సన్నివేశాల్ని చక్కగా చిత్రించారు; ఈ చిత్రానికి కథ, మాటలు, పాటలు, దర్శకత్వం శ్రీ ఆత్రేయ నిర్వహిస్తున్నారు. పెండ్యాల నాగేశ్వరరావుచే సంగీతం విన్పిస్తున్నారు. ఈ చిత్రంలో నాయకుడిగా 'రాము' రాజకుమార్ నటిస్తున్నాడు. ఇతర ముఖ్య భూమికల్ని అంజలీదేవి, నాగభూషణం, రమణారెడ్డి ధరిస్తున్నారు. చిత్రం ముప్పాతికభాగం బుచ్చిలోనే చిత్రించబడుతుంది.

—శ్రీనివాస్.

## మీకు తెలుసా?

ప్రముఖ తెలుగు కథానాయిక కృష్ణకుమారి ఒక తమిళ చిత్రంలో రష్యా యువతిగా నటిస్తూంది.

హాస్య నటుడు బాలకృష్ణ ప్రభాత్ థియేటర్సు ప్రదర్శించే నాటకాల్లో వేషాలు ధరించేవాడు.

గీతాంజలికి కోడి సూపు అంటే చాలా యిష్టం.

కృష్ణకుమారికి గసగసాలు వేసిన వక్క పొడుం నములడం సరదా.

రాజసులోచనకు ఫోటోలు తియ్యడం, మంచి ఛాయాచిత్రాల్ని ఆల్బంలో వుంచడం అలవాటు.

చర్చిల్ పాత్రను పోషించేందుకు రిచర్డ్ బర్టన్ నిరాకరించారు.

శ్రీ జగ్గయ్యకు ఖాదీ పైజామా, లాల్చీ ధరించడం అలవాటు; ఇంగ్లీషు నవలల్ని చదవడమంటే మంచి నీళ్ళు త్రాగడం అన్నమాట.

టి. ఎల్. కాంతారావుకు బిస్కెట్లు తినడం అలవాటు.

## సినిమా డైరీ

● అంతా కొత్తతారలతో నిర్మించబడే కల్చరల్ ఆర్ట్సువారి "జీవితాలు" చిత్రం సగానికి పైగా పూర్తయింది. శ్రీ నారాయణబాబు నిర్మించే యీ చిత్రానికి మూర్తి దర్శకుడు.

● జెమినీ కలర్‌లో నిర్మించే చిత్రంలో షావుకారు జానకి, ఎం. జి. ఆర్.తో నటిస్తూంది. "నిండుమనసులు"లో ఎల్. విజయలక్ష్మి, "ఫూల్ ఔర్ పత్తర్"లో శశికళ ధరించిన పాత్రను జయలలిత తమిళంలో ధరిస్తూంది.

● "కన్నెపిల్ల" నిర్మాతలు శ్రీ టి. ఆర్. రామన్న దర్శకత్వంలో ఈస్టుమన్ కలర్ చిత్రాన్ని భరణీ స్టూడియోలో నిర్మిస్తున్నారు.

● ఉదయభాస్కర్ "నవ్వులు—పువ్వులు" చిత్రంలో జగ్గయ్య, కృష్ణకుమారి, చలం ముఖ్యపాత్రల్ని ధరిస్తున్నారు.

● "తిల్లానా మోహనాంబాళ్" చిత్రంలో పద్మశ్రీ శివాజీ నాదస్వర విద్వాన్‌గా నటిస్తున్నారు.

● తమిళ "పావకోసం" చిత్రానికి ఆ చిత్ర కథకుడయిన శ్రీ తురయూర్ మూర్తియే సంభాషణలు వ్రాస్తారు.

● "ఆస్తిపరులు" చిత్రానికి తమిళంలో "ఎన్ తంబి" అనిపేరు పెట్టారు. శివాజీ, బాలాజీ, మన నాగేశ్వరరావు, జగ్గయ్యలు ధరించిన పాత్రలను పోషించారు.

## ...బృహత్కథామంజరి

(14వ పేజీ తరువాయి)

కున్నాడు. అధిపతి విభీషణుడని తెలిసింది. కొంచెం భయం తగ్గింది లోహజంఘునికి. విభీషణుని ఆస్థానానికి బయలుదేరాడు.

విభీషణుడు రామచంద్రుని పైన వున్న గౌరవంతో లోహజంఘునికి అతిథి సత్కారం చేసి గౌరవించి, ఎవరు ఏమిటి అని కుశల ప్రశ్నలు వేశాడు. లోహజంఘుడు 'లంకాధిపా, నేను మధురావాసిని. అక్కడ సాక్షాత్తు విష్ణువు నన్ను రత్నాలు తెమ్మని మీ వద్దకు పంపాడు' అని అన్నాడు. మానవ సామాన్యుడు లంకకు రావడం కష్టం గనుక విభీషణునికి అతని మాటలపై నమ్మకం కలిగింది. విష్ణువుకు మంచి కానుకలు ఇవ్వడం ఉచితమని భావించాడు. ఇది శంఖం, ఇది చక్రం ఇది గద, ఇది రత్నం—అని పేరు పేరున చెబుతూ, ఉపాయనాలు సమర్పించి అతనికి విడిగా అమూల్యమైన రత్నాలు పెక్కు బహూకరించాడు. అతడు మరల మధుర చేరుకోడానికి సువర్ణుని వంశపు ఒక పక్షిని వాహనంగాను ఏర్పాటు చేశాడు. లోహజంఘుడు కొన్నాళ్లు లంకలో గడిపి, విభీషణుని వద్ద సెలవు తీసుకొని సువర్ణ వాహన మెక్కి మధుర చేరాడు.

మధురలో రూపిణి లోహజంఘుని వియోగంతో కృశించి పోయింది. తల్లితోను మాటలు మానివేసింది. తల్లితో అంతగా మాట్లాడవలసివస్తే, శయనాగారం తెర తొలగించక లోపలనుంచే మాట్లాడేది.

లోహజంఘుడు ఒకరాత్రి దివ్యపీతాంబరం ధరించి, చెవుల కుండలాలు ధగధగ మంటుండగా, మెడలో పూవులదండ—వనమాల వంటిది మోకాళ్ల కింద వరకు వ్రేలాడగా శంఖ చక్రాంకితుడై సువర్ణ వాహనంపై రూపిణి ఇంటికి వెళ్లాడు. రూపిణి అతనిని చూచి సాక్షాత్తు విష్ణువే తనను అనుగ్రహించడానికి వచ్చాడని నమ్మింది. అతనికి సేవలు చేసింది. ప్రతి రాత్రీ ఇలా జరిగింది. రూపిణి, లక్ష్మీదేవి సౌభాగ్యం తనకు అబ్బిందనే గర్వంతో, పొంగి పోసాగింది. అసలే ఎవరితోను మాట్లాడేదికాదు, యిప్పుడు మరీ



# క్రీడ - వృత్తి - విలాసం



కె. ఎస్. నరసింహన్

టెన్నిస్ ప్రపంచం కుతకుతలాడ పోతోంది! ఇటీవలే అంతర్జాతీయ టెన్నిస్ ఫెడరేషన్ ఆటని వృత్తిగా వాడుకుంటున్న 'ప్రొఫెషనల్' ఆటగాళ్లని 'విలాసం' కోసం ఆడే ఎమాచూర్ ఆటగాళ్లతో సమానంగా పరిగణించటానికి నిశ్చయించుకుంది. ఇంతదాకా ప్రొఫెషనల్స్‌ని వింబుల్డన్ వంటి పోటీలలో ఆడనిచ్చేవారు కారు. అందుచేత ఎన్నో పోటీలలో మంచి ఆటగాళ్లయిన వారు పాల్గొనే అవకాశం ఉండేది కాదు.

ఈ విషయమయి కొన్ని వాద వివాదాలు పెరుగుతున్నాయి. కాని, ఈ రకం మార్పు కావాలని అలజడిచేస్తూ వచ్చినవారు సంతోషంగా ఉన్నారంటే అతిశయోక్తి లేదు.

ఇదే పద్ధతి ఇతర ఆటలకి కూడా వర్తిస్తే?

ఈ శీర్షికలో ఈ విషయంమీద ఆంధ్రప్రదేశం ప్రభుత్వం వైఖరి గురించి రాశాను. ఇది పింఛనుల పంపిణీ గురించిన విషయం కూడా. వివిధ రాష్ట్రప్రభుత్వాలు, కేంద్ర ప్రభుత్వం ఎన్నో తరిఫీదు (కోచింగ్) స్కీములని ప్రోత్సహిస్తున్న సంగతి అందరికీ తెలిసిందే. ఈ స్కీముల వల్ల ఆటలనే వృత్తిగా చేసుకోదలచిన ఆటగాళ్లకి మంచి జీవనోపాధులు కలుగుతున్నాయి. అంతేకాక కొత్త తరం క్రీడాకారుల 'ఉత్పత్తి' కూడా జరుగుతోందికదా! క్రీడలని వృత్తిగా స్వీకరించినవారి పట్ల విరసన క్రమంగా తగ్గుతూ వస్తోందన్నా అతిశయోక్తి లేదు. పోగా, వారి కృషిని తగుమాత్రం గుర్తించటం కూడా జరుగుతోంది.

ఇక పయిన తాము ఆటల మీద డబ్బు సంపాదించుకుంటున్నామని 'వృత్తి క్రీడాకారులు' చిన్నతనంగా అనుకోనక్కరలేదు.

బ్రిటన్ చాలా సాంప్రదాయ బద్ధమయిన దేశం. అక్కడే, క్రికెట్ ఆటలో ప్రొఫెషనల్ లని వేరు చెయ్యటం లేదు. వారు తమ దేశం జట్లకి నాయకత్వం వహిస్తున్నారు కూడా.

భారతదేశంలో ఆర్థికంగా కొంత ఇబ్బంది పడుతున్న క్రీడాకారులు ఎందరో ఉన్నారు — క్రికెట్‌లోనూ, ఇతర ఆటలలోనూ కూడా. వీరంతా వృత్తి క్రీడాకారులయితే ఆర్థికంగా ఎంతో బాగుపడతారు.

ప్రభుత్వాలూ, వివిధ ఆర్థిక సంస్థలు క్రీడాకారులని ఎంతో ప్రోత్సహిస్తున్నాయి. కాని, ప్రేక్షకులూ, ఆటగాళ్లూ కూడ వృత్తి క్రీడాకారుల స్థానాన్ని గుర్తించాలి. అప్పుడే వారికి న్యూనతాభావం అంటూ ఉండదు.

* * *

మదరాసు గోపాలన్ ట్రోఫీని సిలోన్‌కి వదులుకుంది. కొలంబోలో జరిగిన మాచ్‌లో 105 పరుగుల తేడాతో సిలోన్ గెలిచింది. ఆ ద్వీపం వోపెనింగ్ బవులర్ విమలరత్నె తన జట్టు విజయానికి సారధి. ఒక్కొక్క ఇన్నింగులో అయిదు వికెట్లు తీసుకున్నాడు.

మదరాసు తరఫున ఆడిన ఎస్. వెంకటరాఘవన్ తన 'ఫార్మ్'ని కోల్పోలేదు. 9 వికెట్లు పడగొట్టాడు; రెండవ ఇన్నింగులో 54 పరుగులు వేశాడు.

## ...బృహత్కథామంజరి

శ్రీరఖిగిపింది; నేను దేవతను; విష్ణు కామితను అంటూ.

ఇలా ప్రతి రాత్రీ లోహజంఘుడు విష్ణు రూపంతో రూపిణితో గడపసాగాడు. మకరదంష్ట్ర కూతురి పోకడలకు, మురిసిపోవడాలకు ఆశ్చర్య పడసాగింది. 'అమ్మాయీ, ఏమిటే? నాకూ చెప్పవే, నేను సంతోషిస్తాను.' అని పెక్కుసార్లు బతిమాలినా ఆమె చెప్పలేదు. కాని, వృద్ధురాలు మకరదంష్ట్ర మిన్నకుండలేక ఒకనాడు ఒక రహస్య స్థలంలో పొంచివుంది ఈ రహస్యం తెలుసుకోవడానికి. పక్షివాహనంపై విష్ణువు రావడం, తన కుమార్తెతో సరసాలాడడం కనిపించింది. చాలా అద్భుత మనిపించింది.

తెల్లవారింది. విష్ణువే తన కుమార్తె ప్రియుడయినప్పుడు ఇక కావలసినదేమి? వృద్ధురాలికి బొందెతో స్వర్గానికి వెళ్ళడామనే ఆశ కలిగింది. తెమరుగున వున్న రూపిణికి ప్రణమిల్లి తన కోరిక తెలిపి, విష్ణువుకు విన్నవించమని ప్రార్థించింది. ఆ విష్ణు విగ్రహుడు నిజంగా విష్ణువే నమ్మినందున రూపిణి అతనికి తన తల్లి వాంఛ నివేదించింది...'మా అమ్మ మీ ప్రసాదంతో సశరీరంగా స్వర్గానికి వెళ్ళదలిచింది. అనుగ్రహించు మహానుభావా' అని. ఆ కేశవాకారుడు సరే నన్నాడు.

లోహజంఘునికి వేశ్యమాతకు బుద్ధి చెప్పడానికి మంచి అవకాశం దొరికింది. కపితీరా అవమానించాలనుకొన్నాడు ... 'రూపిణీ, అయితే విను. మీ అమ్మ బొందెతో స్వర్గానికి వెళ్ళాలంటే చాల చేయవలసి వుంటుంది. ఉదయం ఏకాదశి అనగా ఆమె తల గొరిగించి, పంచశిఖలు పెట్టించాలి. దిసమొలచేసి దేహానికి ఒక నైపు సిందూరం పూయాలి. నల్లరంగుతో నొసట త్రిపుండ్రాలు పెట్టాలి అప్పుడు ఆమెను నా ఖగవాహనంపై తీసుకొని వెళ్ళతాను.' రూపిణి మరునటి ఏకాదశి నాటి వెనుక రాత్రి విష్ణు స్వరూపి చెప్పినట్లే చేసింది.

ఆరాత్రి లోహజంఘుడు ఆ వేషంలో మకరదంష్ట్రను తన పక్షివాహనంపై ఎక్కించుకొనిపోయి మధురలోని దేవాలయం తోరణ స్తంభంపై కూర్చోబెట్టాడు. 'ఇక్కడే వేచివుండు' అని చెప్పి వెళ్ళిపోయాడు. అంతకుముందే లోహజంఘుడు ఆ దేవాలయంముందు పూజావ్రతాలకోసం వచ్చిన బ్రాహ్మణులతో 'భయంకర రూపిణి అయిన మారి త్వరలో మీపైన పడుతుంది. ఏదైన శాంతిరక్ష చేసుకోండి' అని ఆకాశం నుంచి చెప్పాడు. వారు భయపడి శాంతి స్వస్తివచనాలు,స్తోత్రాలుపఠనంచేయసాగారు. ఆ ధ్వనితో దేవాలయం మారుమ్రోగింది.

వీరు స్వస్తివచనమంత్రాలు పఠిస్తుండగా, మకరదంష్ట్ర తోరణస్తంభంమీద దిసమొలతో వున్నందున, రాత్రంతా చల్లగాలికి తట్టుకోలేక, బాధపడుతున్నది. 'అయ్యో! హా! పడుతాను. పడుతాను' అని భయంతో కేకలు వేయసాగింది. కిందవున్న విప్రులు 'తల్లీ, మారీ, మామీద పడవద్దు. నీకు నమస్కారాలు. నీవే మాకు రక్ష' అని ప్రార్థించారు. 'ఉహూఁ! పడిపోతాను!' అంటూ వణుకుతూ, మళ్ళీ మళ్ళీ కేకలు వేసింది ముసలిది. కిందవున్నవారంతా చాల భయపడుతూ, 'వద్దు తల్లీ! వద్దు తల్లీ!' అంటూ మళ్ళీ మొరపెట్టుకున్నారు. ఈ విధంగా ఆక్రందనాలతో, ప్రార్థనలతో ఆరాత్రి నూరుసంవత్సరాలలా గడిచింది.

తెల్లవారేవేళకు మధురానగరం జనమంతా ఆబాలవృద్ధం ఆ తోరణస్తంభం చుట్టూ మూగారు. ఆ వెలుతురులో వికారస్వరూపంతోవున్న వ్యక్తి స్తంభంపై కనిపించింది. ఒక బ్రాహ్మణుడు పోల్చుకున్నాడు, ఆ వ్యక్తి రూపిణి తల్లి మకరదంష్ట్ర అని. ఈ సంగతి రూపిణికి తెలిసి, పరుగుతో అక్కడికి వచ్చింది. కొందరి సహాయంతో ఆమెను స్తంభం మీద నుంచి దింపించి, ఇంటికి పిలుకుని పోయింది.

అక్కడ గుమిగూడినవారికంతా ఇదేదో పరిహాసం కోసం చేసిన పనిలాగ కనిపించింది. అందరూ గుసగుసలాడుతుండగా, లోహజంఘుడు విష్ణురూపం వదలి అక్కడికి వచ్చి జరిగిన సంగతంతా తెలియజేశాడు. అందరూ లోహజంఘుని కసికి ఆశ్చర్యపడ్డారు; వేశ్యావృద్ధకు మంచి శాస్తి జరిగిందని నవ్వుకున్నారు.

తర్వాత లోహజంఘుడు తను లంక నుంచి తెచ్చిన రత్నాలు రూపిణికి ఇచ్చి, ఆమెతో సుఖంగా వున్నాడు.

*　　*　　*

రాజకుమారి వాసవదత్త వసంతకుడు చెప్పిన అద్భుతమైన కథను విని అమందానందం చెందింది. ఆ ఆనందంతో ఆమె పెదవులపై మందహాసం మెరిసింది. ఆ మందహాసానికి ఆమె సుందరవదనం మరింత ప్రకాశించింది.

(ఇంకా వుంది)




Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

# సబ్బులన్నియు శుభ్రపరచును కాని...

... నిష్కళంకమైన చర్మసౌందర్యం నిమిత్తం
## జి-11తో గూడియున్న సింథాల్
మీకు కావలెను.

సింథాల్ యందు గల జి-11 (హెక్సాక్లోరోఫీన్) చర్మ పొదలను గలిగించే హానికరమైన క్రిములను చంపుతుంది. ఆహ్లాదకరంగా పరిమళమొనర్చబడినటువంటి జి-11 తోగూడియున్న సింథాల్ మీ చర్మమును మృదువుగాను, ప్రకాశమానంగాను వుంచుతుంది.




INTERPUB GCS 9A-TEL

Regd No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA.

తేదీ 26-4-68 మొదలు

